యువకవిసమితి ప్రచురణము — ౧

*

# కావ్యావళి

*

సోమరాజు ఇందుమతీదేవి

చిత్రకారులు :
శ్రీయుత
అడివి బాపిరాజుగారు,
బి. ఏ., బి. యల్.

వెల నాలుగు అణాల
తపాల బిళ్లలు

ప్రథమ ముద్రణము

౧౯౩౬

ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల,
బెజవాడ.

వలయువారు :
కొండపల్లి గోపాలరావు దేశముఖ్, అనిశెట్టిపల్లి,
భద్రాచలంరోడ్డు రైల్వేస్టేషన్, N. S. R.
లేక
యువకవిసమితి, కలువపాముల, కృష్ణాజిల్లా.

# విజ్ఞప్తి:

ఈసంపుటి నా కవితాకుమారియొక్క శైశవదశ. నైసర్గికమును అనిర్వచనీయమునునగు వాత్సల్యమందె యుండుట నాదశా విపరిణామమున కెట్టియత్నమును చేయ మనసువచ్చినదికాదు.

ముద్రణసమయమున దగ్గఱనెయుండి యన్నివిధముల దోష రహితముగ చేయుట కెట్టియవకాశములు లేనందుకు వగచుచు తత్కారణమున దొరలిన లోపములను దయతో మన్నింప పాఠకులకు వేడికోలు.

వివిధరీతుల వెల్లివిరియుచున్న యీనాటి సారస్వతమున చాల భాగము సరళాదేశాదులు, రేఫ శకటరేఫాది విభేదములు పాటింపకుండుటయే తద్విషయికమగు నుపేక్షాభావమున సంపుటియందు దానము.

పుస్తకము నామూలాగ్రము చదివి ప్రవేశికను రచియించి, అ ప్రాయముల నొసంగి, ముఖచిత్రమును చిత్రించి, అన్ని విధముల నాదరభావమునుజూపిన పూజ్యులకు నమోవాకములు.

ధాత - ఉగాది　　　　ఇందుమతీ దేవి

## ప్రవేశిక:

శ్రీరంగపతి భర్త, *ఇందిర భార్య. ఈ దాంపత్య మిక్కడ వక్కడ సరిపోయినది. తొలిపద్యమునవే శ్లేషను గూడ వీలిచ్చినది. ఇట్లు చక్కగా కుదురుటగూడ ఒకానొక పుణ్య పరిపాకమే. ఈ యభేదాధ్యవసాయము కవయిత్రికి సర్వంకషమైన యనుమతిలేనిది. తన భర్త రంగనాథుడే. ఈ రంగనాథుడు మనుష్యుడే కాని భగవంతుడు కాడు. తనభర్తకు రంగనాథునకు సామ్యము గుణాదులయందు, భర్తకౌత్కృష్ట్యము సంపాదించుటయందు, తనభర్తయందు తనకు గల గౌరవాతిశయము ప్రకటించుటకొరకుగాని తన ప్రాణేశ్వరత్వము నందు గాదు. ఇదియొక చిత్రము. చైతన్యులకును, వైష్ణవులకును వీరి యుపాసనవేళ, జీవుడు స్త్రీ, పరమేశ్వరుడు పురుషుడు. ఆళ్వారులందఱు ఉత్తమనాయికలు. తన తిరువాయ్‌మొళి యను గ్రంథములో తిరుప్పానాళ్వారు, తాను నాయిక తనతల్లి దూతిక. భగవంతుని ముందు భక్తులందఱు స్త్రీలే. స్త్రీపురుషవిభేదము లేదు. ఇది వైష్ణవమతము. కాని కవయిత్రి అద్వైతమతస్థురాలు. జ్ఞాతవ్యమైనవస్తువు బ్రహ్మపదార్థము. బ్రహ్మవిదాది వరిష్ఠాంతమైన యొక మహానుభూతిని పొందుటకు, జన్మపరంపర సాధనాహేతువు. తానెత్తిన జన్మయందు తనకు విధింపబడినకర్మ ఆసాధనామార్గము. భగవంతుడు తన యుపాసనాధిదైవతము. అతడు భర్తకాడు. అందుచేత, ఈమె వేణుగోపాలుని తన భర్తయని పిలువదు. నీవు తండ్రివి నన్ను కూతుగా చూచుకొనుమనును. తమ దంపతులకు ననో-

---

* కవయిత్రికి చిన్ననాటి పేరు.

న్యానురాగము నాయన వృద్ధి చేయవలయును. ఇదియొక విలక్షణమైన యుపాసనామార్గము. గోపికలు కామోత్కంఠత చేత, కంసుడు భయముచేత, తదితరులు తదితరభావముల చేత ఉద్దామధ్యానగరిష్ఠులై హరిని జెందిరి. దేవ యశోదలు భగవంతుని పుత్రునిగా భావించి తల్లితనము సాధనగా చేసికొనిరి. కూతురుతనము సాధనగా చేసికొన్నది కనివిని యెరుగము. ఈకవయిత్రి సాధనామార్గ మిట్టి క్రొత్తది.

ఈమార్గము సర్వాంగసుందరముగా గూడ నున్నది. శంకరాదులు పోయిన మార్గమునే యీమెకూడ ననుసరించినది. పూజాపద్ధతి, శంకరాదులది. రచనాపద్ధతి, పూర్వాంధ్ర శతకరచయితలది. ఈమె యుపాసనలో ప్రధానమైనది మానసికపూజ. పతిభక్తిచివర, శతకముచివర, ఆమానసికపూజ విస్తరింపబడియుండుటయే దీనికి నిదర్శనము. రంగనాథ స్తుతియందుగూడ నిది కలదు.

సామాన్యముగ రచనలో నొకయుత్తమస్థితి ప్రాప్తించిన తరువాత గాని కవులకు శిల్పదృష్టికుదురదు. ఈ గ్రంథ విషయమున రచన నిర్దుష్టమై యొకస్థాయికి పట్టినదని చెప్పుటకు వీలులేదు. రచనకన్న శిల్పదృష్టియే యీకావ్యముల యం దెక్కువ పరిణతమైనట్లు తోచెడిని. పతిభక్తి నడిమి యూర్ములు తీర్చిదిద్దినట్లున్నవి. ఒకపరిస్థితి దీసికొని దానిని చిట్టచివరదాక వివరించి ఔచిత్యము చెదరిపోకుండ నీయూర్ములు రచింపబడినవి.

కావ్యమునందు ప్రధానముగా ఆనందము సమకూర్చెడివానిలో పాత్రయొక్క మనోభావములను వెల్లడిచేయుట యొకటి. ఆవెల్లడిచేయుట రెండువిధములు: తాను తనకన్న న్నమైన పరిస్థితులుగల యొక వ్యక్తిని సృష్టించి తన మేధాశక్తి

చేత అతని మనోభావములను యథార్థప్రాయముగ సృష్టించుట మొదటిది, తానే నాయకుడై తన మనోభావములను చిత్రించుట రెండవది. రెండవది స్థూలదృష్టికి తక్కువగా కనిపించును. ఈ దృష్టియే భావకవిత్వమునందు కొంత నిరాదరణమునకు హేతువు. స్వమనోభావములను గూడ హృదయంగమముగా చెప్పుట ఉత్తమమైన కవితాబుద్ధి లక్షణమే. పురుషుని విషయమున, ఔను - కాదు. స్త్రీ విషయమున తప్పకుండ నగును. భార్యనో, నాయికనో చూచి, పురుషుని వేదన సర్వకావ్యములయందు తోచుచున్నది. భర్తనుగూర్చి భార్యయొక్క భావములెట్టివో తెలియజెప్పు కావ్యములంతగా లేవేమో! పూర్వగ్రంథములయందు స్త్రీపాత్రలు లేరా యన్నచో, ఉన్నారు. అవి యలంకారశాస్త్రపు వరవడులు. ఇచ్చటనో ఒక పతివ్రతయైన స్త్రీ తన మనోభావములను విప్పి చెప్పుచున్నది. ఇట్టిది తెలుగులో నిదివరకు లేదు. క్రొత్త పెండ్లికొడుకు అత్తవారింటికి పోయి తన మఱదలి తొంగి తొంగి చూచిన చూపులు రమ్యముగా వర్ణించిన యాధునిక కవులున్నారు. భర్త యింటికి వచ్చినప్పుడు క్రొత్త పెండ్లి కూతురెట్లు భావించునో ఆ క్రొత్తవిషయ మీ కావ్యమునందు గలదు. ఆమె పతిదేవతయగుట నారచనలో తేలికతనము కన్న మన్నతత్త్వ మెక్కువ కనిపించుచున్నది. భర్త పొరుగూరు పోయినప్పుడు స్త్రీమనోభావములు వర్ణించుట వేరొక యూర్మిలోనికథ.

రంగనాథస్తుతి మృదువైన పాకములోనున్నది. దీనికి రెండు కారణములు. కవయిత్రి స్త్రీ; ఛందస్సు ద్విపద. ఆమెకు వృత్తరచనయందు చేయితిరుగలేదు. ద్విపదలో తిరిగినట్లు

కనిపించుచున్నది. దీనికి కారణము రచయిత్రిశక్తి, ఛందశ్శక్తి, సన్నిహితములుగా నుండుట. ఈమె పతిభక్తియందు గీతములలో చూపించిన శిల్పచాతుర్యము ద్విపదలో ప్రదర్శించినచో నది యెక్కువపరిణతమై కన్పించవచ్చును. ఆమెబుద్ధియు శక్తియు సుకుమారములు. ద్విపదయొక్క ఛందస్సు కొద్దిది; సుకుమారమైనది. రెంటికి నెక్కువసన్నిహితత్వముగలదు.

ఈమెయాధునిక కవులరచనల బాగుగ నెఱుగును 'నీకు పూవులు గుచ్చి దండవేయుదును' అన్నశతక సీసపద్యమున పానుగంటివారి రాధాకృష్ణయందలి యొక సపద్యములోని ఛాయ; మరికొన్నిచోట్ల చిలకమర్తివారిఛాయలుగలవు. పూర్వ శతకకవుల మార్గములును ననుసరింపబడినవి. మొత్తముమీద ననుకరణము తక్కువ; స్వతంత్రత యెక్కువ.

రచనలో కుదిరీకుదురని పద్ధతి. కొన్నిపద్యములు మిక్కిలి పేలవములు; మరికొన్ని చిక్కనిశైలిగలవి. అంతయు కలిపి చూచినచో కవిత యొకమహామార్గమునుగూర్చి పోవుచున్నట్లు కనిపించును. ఆవిఫలించు సూచనలుగూడ కలవు.

ఈమెయందు మరొకదివ గుణము కనిపించుచున్నది. అది యార్షమైనబుద్ధి. ఈమెపతిభక్తి వట్టి స్త్రీపురుషప్రేమ జన్యము గాక యార్షమతావలంబితాజన్యముగా కనిపించును. భగవంతుని యజ్ఞమయునిగా చెప్పుట దీనికి ప్రబలసాక్ష్యము. కృష్ణునియష్టభార్యలు భగవంతుని సేవింతురని చెప్పునట్టి కొన్ని శతక సీసపద్యములలో ఆమె మనోవృత్తి యొకవిచిత్రరమ్యత గలిగించుకొనుచున్నది. ఆర్షబుద్ధి వీరియింటి సంప్రదాయము. దానియం దాశ్చర్యములేదు గాని తొలుత చెప్పిన యీమె

యుపాసనాపద్ధతియం దాశ్చర్యము గలదు. భర్తయందలి ఏకాభిరతి జన్మపరంపరావసానమైన బ్రహ్మపదార్థనిశ్చేతవ్య నిశ్చలైక బుద్ధికి మార్గముగా పూర్వులు శాసించినది. దాని నీమె యింతసుష్ఠుగా నాచరించుట పురాజన్మ సంస్కారవిశేషఫలము.

ఈమెపతిభక్తి యొకమాలయైనచో చివరి పద్యము మేరుపూస. లక్ష్మీదేవి లోకములేలగల శక్తిగలదట, కాని విష్ణుదేవున కొదిగి పురుషున కధికత నిచ్చుచున్నదట. ఈమె యీభావములో పాతకునకొక విచిత్రమూర్తిగా భాసించుచున్నది. ఇది యాధునిక స్త్రీలోకమున కొక యుపదేశము.

ఇట్టి దివ్యబుద్ధికి భర్తయైన ఆరంగారావుగారు అదృష్టవంతుడు. తెలుగునాటికి తొల్లిటిగొప్పతనము సిద్ధించవలయునన్నచో నిట్టిస్త్రీలు బహుధా వెలయవలయును.

మచిలీపట్టణము
5-3-1936 విశ్వనాథ సత్యనారాయణ. ఎమ్. ఏ.

*

# పండితాభిప్రాయములు

ఆంధ్రసాహిత్యచక్రవర్తి
బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహకవిగారు

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచియించిన గోపాలశతకము, పతిభక్తి, రంగనాథస్తుతి, * శాకుంతలాభ్యుదయమునను గ్రంథములలోనిపద్యములఁ జదివించుకొని వింటిని. ఈమె నివాసస్థానము నిజాముగాజ్యములోని రుద్రాక్షపల్లి. ఈమెబాల్యమునుండియు సంస్కృతాంధ్రభాషలఁ జదువుకొని, చక్కని పాండితమా భాషలలో సంపాదించి కవిత్వము జెప్పనారంభించిన యువ ంమణి. ఈమె కవిత్వము సలక్షణమై నిరుష్టమై లలితమై మనోహరముగా నున్నది. కల్పనలు చాలచోట్ల హృదయంగమముగా నున్నవి. ఇట్లు మనోహరమైన కవిత్వము జెప్పుచున్న యీ కాంతారత్నమునకుఁ బరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యములిచ్చి యితోధికముగా వాఙ్మయసేవ సేయించుఁగాక.

రాజమహేంద్రవరము
2—2—95.

చి. ల. నరసింహము

*

* ముందు ప్రకటింపబడును.

## కింకవీంద్ర ఘటాపంచానన, విద్వత్కవి, బాలసరస్వతి
## బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి శతావధానిగారు

---

శ్రీమత్పరదేవతాయై నమః

1 వేణుగోపాలశతకము 2 పతిభక్తి 3 రంగనాథస్తుతి 4 శాకుంతలాభ్యుదయము, అను నీనాల్గుపొత్తములును హరి రామలింగశాస్త్రి నాకు వినిపింపఁగా సావకాశముగా వింటిని. ఈపొత్తములను రచించిన దొక కవయిత్రి. ఈపె నివాసగ్రామము నిజామురాష్ట్రములోని రుద్రాక్షపల్లె. ఈపె సువాసిని. కవిత్వము నిర్దుష్టమై మిక్కిలి మృదువుగానుండి ముద్దులొలుకుచున్నది. ఈపె పుట్టింటివారు కొల్లూరివారు, జమీందార్లు. అత్తవారింటిపేరు సోమరాజువారు, భర్తపేరు రంగారావుగారు. ఈపెమాత్రమే కాక అన్న గోపాలరావుగారుగూడ కవియగుటచే నీకుటుంబము కవితాకుటుంబమనుకోవలయును. ఈపె కవిత్వపుశైలిచూచిన సంస్కృతభాషావాసన యేకొంచెమో కాక విశేషించియున్నట్లు తెలియనయ్యెడిని. పతిభక్తి, దైవతభక్తి-యివి యీమె కవిత్వమునందు మిక్కిలిగా వివరింపఁబడియున్నవి...భగవంతుఁ డీపెకు దీర్ఘసువాసినీత్వము ననుగ్రహించి యింకను నిట్టి కబ్బములను పెక్కులు రచించునట్లు చేయుటయేకాక ఇహలోకానందములలో ముఖ్యమగు సత్సంతానభాగ్యమునుగూడ ప్రసాదించుఁగాకయని యాశీర్వచించుచు నింతతో ముగించుచున్నాఁడను.

కడియము
3–12–35 చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి, శతావధాని

శతావధానులు

## బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు

బ్రహ్మశ్రీ కొళ్లూరు జోగారావుగారి ఉపాసన వారిపుత్రి ఇందుమతీ దేవిగారి కవితగా ఫలించుట చూచి తనిసితిని. ఈమె శిల్పమున ఒక పవిత్రరూపము గోచరించినది.

సూరవరం
2–2–36

వేలూరి శివరామశాస్త్రి

*

ఆంధ్ర విశ్వకళాపరిషత్పండితులు

## బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచియించి ప్రకటించి పంపిన కావ్యావళి యను పద్యకావ్య సంపుటము చదివి యానందించితిని. అందలి పతిభక్తి, రంగనాథస్తుతి, వేణుగోపాల శతకము అను మూఁడును, ఆమె త్రికరణశుద్ధితోడి యైహికాముష్మికపరతకుఁ దార్కాణములై యొప్పుచున్నవి. యువతీమణుల కుదాహరణప్రాయమైన యామె పవిత్రజీవిత మా కావ్యావళిఁ బ్రతిఫలించుచున్నది. కవితయు మధుమధురమై సరళశైలి నలరారుచున్నది.

విశాఖపట్టణము
28-2-36

మల్లాది సూర్యనారాయణశాస్త్రి

*

ఆంధ్రవిశ్వకళాపరిషదాంధ్రశాఖాప్రధానులు

మహారాజ॥

పింగళి లక్ష్మీకాంతకవిగారు, ఎం. ఏ.

---

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచించిన "కావ్యావళి"ని ఆమూలాగ్రము చదివితిని. ఇందు పతిభక్తి, శ్రీరంగనాథస్తుతి, వేణుగోపాలశతకము అనెడి మూడు ప్రకరణములు గలవు. ఈ మూడింటను, అంతర్వాహినిగా ప్రసరించుచున్న భావ మొక్కటియె. అది స్వచ్ఛమైన అనురాగము. ఈ భావమే పతిగతమైనపుడు ప్రణయముగాను, పరమేశ్వరగతమైనపుడు భక్తిగాను వ్యక్తమగుచున్నది. పరమార్థమున ఈ రెంటికిని భేదములేదని ఆర్యులతలంపు. కవయిత్రికి ఈ ధర్మరహస్యము చక్కగా అవగతమైనటుల గ్రంథము సర్వత్ర విదితమగుచున్నది. ఈ రచన కావ్యగుణముచేతను, వస్తుతత్త్వముచేతను సాత్త్వికమై యొప్పారుటచే సర్వథా ఉత్తమశ్రేణి నధిష్ఠించుచున్నది. శైలియు, సుబోధకమై, ప్రసన్నమై, అపేలవమై పూలమాలవలె వాసించుచున్నది. ఈమె యింతకంటెను గుణాధికతగల కావ్యముల రచించి ఆంధ్రభారతి నలంకరించుగాక.

విశాఖపట్టణము
2 - 9 .6

పి. లక్ష్మీకాంతం

*

ఆంధ్రవిశ్వకళాపరిషత్పండితులు

## బ్రహ్మశ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు

శ్రీమతి యిందుమతీదేవిగారిచే రచితమగు కావ్యావళి నిజదివితిని. ఇందలికవితారీతి మృదుమధురమై హృదయంగమమైయున్నది. పాతివ్రత్యమున కౌదర్యపాత్రియమైయున్న హిందూదేశములోని సతీమణులు ముఖ్యముగ నవలంబించు పతిభక్తియు దైవభక్తియు నిందు సర్వతోముఖముగఁ గవయిత్రిగారిచేఁ బ్రదర్శింపఁబడి యుండుటంజేసి ప్రస్తుతము ప్రబలుచున్న స్త్రీవిద్యకియ్యది యత్యంతోపకారకమై సమాదరణపాత్రమగుచున్నది. ఇందలి కృతిత్రయములోఁ బతిభక్తియనెడి భాగమే యగ్రస్థానమున నెలకొల్పఁబడుటంజేసి స్త్రీలకుఁ బతిభక్తియె ప్రథమగణ్యమని విశదమగుచున్నది.

కవితాకళాప్రియుండగు భగవంతుఁడు కవయిత్రిగారికిఁ తోధిక భాషాకృషిపరతయు సౌభాగ్యాయురారోగ్య వృద్ధియుఁ బ్రసాదించి సప్తసంతానకలితసంపత్తి ననుగ్రహించుఁగాక.

విశాఖపట్టణము
--96

వఝల చినసీతారామస్వామిశాస్త్రి

*

## మహారాజరాజశ్రీ శ్రీరాజా వేంకటాద్ర్యప్పారావు
## బహద్దరు జమీందార్ గారు

---

ఈగ్రంథమునందుగల ప్రతిభాగమును మధురకోమలకాంత పదావళిగలదై చదువంజదువ మానసానంద దాయకమై యొప్పుటయేగాక స్త్రీపురుషులకెల్లఱకును నపరిమితమగు పతిభక్తిని శ్రీపతిభక్తినిగూర్పఁజాలియున్నది. గ్రంథము చదువ మొదలిడినచో సాంతముగునటులకును నితరధ్యానమునువదలి మనస్సు తదేకనిష్ఠమైయుండి, ఇక్షుఖండమునందువలె రసము సంపూర్ణమై మధురరసవర్షియైయొప్పుచుండును.

ఉ॥ కావ్యావళి నడు కాంక్షతోఁబఠియింప
సతులకుఁబతిభక్తి సాంద్రతఁ గను
కావ్యావళి నడు కాంక్షతోఁ బఠియింప
భగవత్స్వరూపంబు ప్రథితమగును
కావ్యావళి నడు కాంక్షతోఁ బఠియింప
ప్రకృతిసౌందర్యంబు భద్రమొసగు
కావ్యావళి నడు కాంక్షతోఁ బఠియింప
గ్రంథకర్తృమనోఘనత తెలియు

గీ॥ నహహ యింతటిభక్తిమహత్త్వయుక్త
వాక్చమత్కృతి నెవరైనఁబల్కఁగలరె
వేణుగోపాలుగుణతతి న్వివిధముల
మానసాసనమందుంచి మధురఫణితి.

ఇట్టి లోకోపకారక గ్రంథముల రచించి పొగడ్తఁగన్న వీరికి నభంగురవిభూతిని శ్రీ శోభనాద్రి లక్ష్మీ నృసింహస్వామి వారు, సకలాభీష్టసిద్ధి పూర్వకముగా నొసంగి, యాచంద్రతారార్కముగా రక్షించుచుందురుగాకయని ప్రార్థించుచున్నాను.

నూజవీడు — (శ్రీ) వారి యనుమతిని పంపినవారు

8-3-36

బొమ్మకంటి వీరరాఘవాచార్యాః
ఉయ్యూరు యస్టేటు ఆస్థానీ విద్వాన్

కవిసార్వభౌమ

## బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచించిన 'కావ్యావళి' యను ఖండకావ్యమును సావధానముగాఁ జదివి యానందించితిని. ఇందుమతీదేవిగారిని నే నెప్పుడో చూచియేయుంటినని నాకు జ్ఞాపకము. ఆమెతండ్రులు జోగారావుపంతులుగారు, రామచంద్రరావుపంతులుగారు, సీతారామయ్యపంతులుగారు, వేంకటరావుపంతులుగారును నాకు మిత్రకోటిలో చేరినవారు, నాయందు మిక్కిలి యనుగ్రహముగలవారు. పూర్వాచార పరాయణులు, దేవబ్రాహ్మణ భక్తితత్పరులు. అందు జోగారావు పంతులుగారు గొప్పలౌక్యులు జమీందారులు నయ్యును, వైదికకర్మాసక్తులై హవిర్యాగముచేసి దీక్షితులై యవిచ్ఛిన్నాగ్నిహోత్రులైరని వ్రాయుట కెంతయు సంతసించుచున్నాను.

అట్టి జోగారాయదీక్షితులుగారి పుత్రీరత్నమగు ఇందుమతీదేవి నవనాగరకతలోఁ బడక సనాతనధర్మ తత్పరయైయుండెననుట కచ్చెరువుపడ నవసరములేదు. కనుకనే యామె కవయిత్రియై పూర్వాచారము ననుసరించి "కావ్యావళి" వ్రాయదొడంగి యందు మొట్టమొదటఁ పతిభక్తినిగూర్చి వ్రాసిన పిమ్మట రంగనాయకాదుల స్తుతించినది.

స్త్రీలకు పతికన్న రంగనాథాదులు హెచ్చుకారని శాస్త్రములు తెల్పుచున్నవి. దాని నీగ్రంథము తార్కాణ జేయుచున్నది.

ఈకావ్యావళి మృదుమధురశైలితో మిక్కిలి మనోహరముగానున్నది. మంచిభావము లిం దిమిడియున్నవి. అటనటఁగొన్ని స్వల్పదోషములున్నను

కవిసార్వభౌమ

## బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

శ్రీమతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచించిన 'కావ్యావళి' యను ఖండకావ్యమును సావధానముగాఁ జదివి యానందించితిని. ఇందుమతీదేవిగారిని నే నెప్పుడో చూచియేయుంటినని నాకు జ్ఞాపకము. ఆమెతండ్రులు జోగారావుపంతులుగారు, రామచంద్రరావుపంతులుగారు, సీతారామయ్యాపంతులుగారు, వేంకటరావుపంతులుగారును నాకు మిత్రకోటిలోఁ చేరినవారు, నాయందు మిక్కిలి యనుగ్రహముగలవారు. పూర్వాచార పరాయణులు, దేవబ్రాహ్మణ భక్తితత్పరులు. అందు జోగారావు పంతులుగారు గొప్ప సౌక్యులు జమీందారులు నయ్యును, వైదికకర్మాసక్తులై హవిర్యాగము చేసి దీక్షితులై యవిచ్ఛిన్నాగ్నిహోత్రులైరని వ్రాయుట కెంతయు సంతసించుచున్నాను.

అట్టి జోగారాయదీక్షితులుగారి పుత్రీరత్నమగు ఇందుమతీదేవి నవనాగరకతలోఁ బడక సనాతనధర్మ తత్పరయైయుండెననుట కచ్చెరువుపడ నవసరములేదు. కనుక నే యామె కవయిత్రియై పూర్వాచారము ననుసరించి "కావ్యావళి" వ్రాయదొడంగి యందు మొట్టమొదటఁ పతిభక్తి నిగూర్చి వ్రాసిన పిమ్మట రంగనాయకాదుల స్తుతించినది.

స్త్రీలకు పతికన్న రంగనాథాదులు హెచ్చుకారని శాస్త్రములు తెల్పుచున్నవి. దాని నీగ్రంథము తార్కాణ జేయుచున్నది.

ఈకావ్యావళి మృదుమధురశైలితో మిక్కిలి మనోహరముగా నున్నది. మంచిభావము లిం దిమిడియున్నవి. అటనటఁగొన్ని స్వల్పదోషములున్నను

## బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

శ్రీమతి సౌభాగ్యవతి సోమరాజు ఇందుమతీదేవిగారు రచించిన కావ్యావళిని చక్కఁజదివిని. ఆర్యసాధ్వీశీలము నీగ్రంథము ప్రతిపదము ప్రతిపాదించుచున్నది. రచనము మొల్ల మాంబా వెంగమాంబల రచనములఁ దలపించుచు లలితమై యున్నది. సుపవిత్రములగు భావములు, వానిని సువ్యక్త పఱుపఁదగిన సముచిత వాఙ్మయవైశారద్యమును గల యీ సాధ్వీమణి స్త్రీ జనోపకారకములయిన సద్గ్రంథములనింకను రచియించి పేర్వోలయుగాక యని యాశించుచున్నాఁడను.

మద్రాస్
0-2-36

వేటూరి ప్రభాకరశాస్త్రి

*

# అంకితము

సతత మెవ్వనినామసంస్మృతి నొనర్తు
ఎవనిరూపమ్ము దివ్యమం చేను దలతు
అట్టి శ్రీరంగరాయనామాంకితునకు
పతికి నిది యంకితంబయి పరగుగాత

# కృతజ్ఞత

తల్లిదండ్రులేమిడి దలపనీక
తల్లిదండ్రులు దానయై తనరె నెవడు
విద్దె గొలదిగ నోరిమె జెప్పించె నెవ్వ
డట్టి యగ్రజు రాజేశు నాత్మ దలతు

# ప్రథమోత్తి

శ్రీ శుభాకార ఇందిరాచిత్తచోర
పరమమృదుభాష శ్రీరంగ భవ్యవేష
పాపవాక్పరిహార స్వరూపమార
తలచి ధ్యానింతు నిను సంతతమ్ము గతిగ

పావనంబగుమీమూర్తి వదల కెవుడు
చిత్తసింహాసనము నధిష్ఠింపజేసి
ప్రణయసామ్రాజ్యపట్టభాస్వన్మహోత్స
వము గావించెదను ప్రమోద మ్మెలర్ప

దైవసమముగ మిమ్ము నెదం దలంచి
తమమనోహరనామాక్షరముల వ్రాసి
విధివిరామములేక జపించుచుందు
పెదవులల్లార్చి గీతి మ్రోగుదును నాథ

జన్మసాఫల్యమయ్యె మీసరణవలన
అక్షయమ్మగు సౌభాగ్య మందుచుంటి
మీదు నామాక్షరశ్రేణి మేరలేక
జన్మతరియింపజేసె నిశ్చయము స్వామి

నిత్యమును క్రొత్తరూపముల్ నెగడుకతన
పలువిధంబుల బూజింప దలపులోదవు
దాన గావించుదాన వందనశతమ్ము
పావనంబగు మీ పాదపద్మములకు

పద్మసంకాశమైన మీపాదయుగ
ఆత్మబాయక ధ్యేయమై యలరు నాకు
జలధరశ్యామలమ్ము మీచాయ దృష్టి
పథమునందున నెప్పుడు పాయకుండు

అమలినానందకృతమతినగుచు నేను
యుష్మదీయస్తవమ్ము పద్యోత్కరమున
ప్రియమనోహర మీదగుపేర శాశ్వ
తమ్ముసేసెద నాచంద్రతారకమ్ము

నన్ను నుద్వాహమైన యానాటగోలె
ఏకరీతిగ నాచిత్త మేలుచుంట
లోకసంస్తవ్యనైతి నాలోని మనసు
నతిపవిత్ర మయ్యెగద నా యాత్మనాథ

పరగ నాజన్మ సార్థకపఱచు నెద్ది
సర్వసౌఖ్యమ్ములను గూర్పజాలు నెద్ది
సకలకళ్యాణముల నీయజాలు నెద్ది
అద్ది మీపాద సేవ నే నాచరింతు

కా. వా. వ

యుష్మదీయ పదాంభోజయుగ కంటె
ఇతర మెరుగనిదాననై యెసగుచుంకి
ఇహపరంబులగల్గు మహీయములగు
సుఖములను సంపదలను నే జూరగొందు

మీదు ముఖతామరసములో మెలగు మధువు
కొదమకనుదుమ్మెదలు గోలుకొనుచునుండు
నిముసమైన మీమూర్తి కన్పింపదేని
ఆ నిముస మొక్కవత్సరం బగును నాకు

అఘవినాశనకారణమైను సతికి
ఆత్మనాథునిసంసేవ యనుచు బుధుల
శాసనముగాన దాని హృజ్జలజమందు
ఎరిగి పూజింతు మిమ్ము లోకేశునట్లు

రూఢమును సుందరమ్ము మీరూప మేను
నిత్యమును పూజచేసెద నిశ్చలమతి
పరమపావనమైన మీ భవ్యనామ
మును నొనర్చెద జపము సంజనితభక్తి

తమ వదనదీప్తి నామది దనరియుంట
అఘతమస్సంఘమంతయు నణగిపోయె
నిర్మలంబయి దివ్యమై నిత్యమైన
పరమపావనమూర్తి నిన్ బాయకుందు

అరసి దేనినిగూర్చి మాటాడుచున్న
చూడ్కులన్నిపిప్పి దృశ్యంబు జూచుచున్న
కడగి భోగ్యపదార్థముల్ గుడుచుచున్న
రుచ్యములుగావు మీదగు రూపుకన్న

దైవసములయి నా మనస్తాప మణచి
తనువుభేదంబులేదను తత్త్వమెరిగి
ఇతరదైవములం దస్మదిచ్ఛమాన్పి
పాలనమొనర్చుచుంటిరి ప్రాణనాథ

తల్లిప్రేముడిమరపించి తండ్రిగారి
గారవంబును విస్మృతిగలుగజేసి
సోదరీసోదరులు నన్ను నాదరించు
కంటె నెక్కుడుగా మీరు గాంచుచుండ్రు

కనులమూతలలోగూడ కమ్రమైన
మీదుమూర్తియె కన్పడి మెలగుకతన
భవ్యగీతప్రసూనముల్ బంతికట్టి
యుష్మదీయపదమ్ముల నుంతు నాథ

అమలభవదీయసంప్రార్థనమునదక్క
దేవ నీదేవి క వేరుదృష్టిలేదు
కాన పతిదేవతాలభ్యగతులు నాకు
శాశ్వతావాసమునకునై సంగతములు

స్వచ్ఛభవదీయసత్ప్రేమజలధియందు
మజ్జనంబొనరించెద మరలమరల
చిత్తమందు భవద్గుణవృత్తులెల్ల
దోచుచున్నవి పూవులుపూచినట్లు

అతివిశాలసంసరణమహాంబునిధిని
నన్ను దరియింపజేసెడి నావ మీరె
అతిపవిత్రమ్ము మామ నాత్మయందు
దేవతాకృతిబొల్చు మూర్తియును మీరె

భాగ్య మాయువు నిత్య మారోగ్యవిభవ
మిచ్చి గాచుత మిమ్ము నా లచ్చిమగడు
బహుళసంతోష కీర్తి సంపత్తులొసగి
కాచుతన్ మిమ్ము హరుడును కమలభవుడు

భాగ్యముల కనురూపసౌభాగ్య మిచ్చి
కాచుతన్ నను వాణియు గౌరి లక్ష్మి
పావనమ్మగు మీ పాదపద్మసేవ
విడని వరమిడుదురు తపస్వినులు సతము

***

## ద్వి యా ర్తి

విమలరాకాసుధాకరసమమనోజ్ఞ
మైన మీమూర్తి నెడబాయ నార్తికాదె
గడియకాలమ్ము మీరు నన్ విడచియున్న
అద్ది సంవత్సరంబయి యలరుచుండు

కార్యనిర్వహణార్థమై గ్రామమేగ
త్వన్మనోహరరూపసందర్శనమ్ము
కలుగమికి లోనలోన వ్యాకులతనంద
అధికతరమయ్యె విరహానలార్తి నాథ

మానసాక్రాంతమైన యీ మన్మథాగ్ని
సన్నసన్నగ రగిలి నా చారుతనువు
నరనరంబులలోన తీక్ష్ణతను జూపి
మండుచున్నది వేసంగియెండవోలె

అతివిరహవేదనామహాయాసఖిన్న
చిత్తనై రంగనామసంస్మృతిని జేయు
నాకు మీ మంజుమంగళాననసుధాంశు
బింబ మరయంగనై యబ్బురంబుగొల్పె

గ్రామమేగిన నాథుని మోముదమ్మి
కాననగుటేమి భ్రమయేమొ కలయొ నిజమొ
అంచు దృష్టినినిగుడించి యరయునంత
దృక్పథమునుండి మీ మోము దెరల బారె

విభ్రమమయైన కలయైన వేరయైన
ఆయతముదమ్ము జేకూర్చి మాయమయ్యె
అరయు టల్లంతలో నన్ను దరుమకున్న
ఒగ్గి మరియొకత్రుటి గాంచియుందు మిమ్ము

నిత్యసందర్శనాభ్యాసనియతిఁ సి
భిత్తిగతచిత్రపటభాసు విష్ణుమూర్తి
ధ్రువుని యాకాంక్షఁబూరించు దొరను నధిక
అంతలో గాంచి నీమూర్తి యరసికొంటి

చిత్తరువటంచు భేదమ్ము జెంద కేను
ధ్రువుని ప్రత్యక్షదేవుని తోయజాక్షు
ప్రవిమలానందరసపరవశతఁ గంటి
అస్మదభిమతసిద్ధియా నని తలంచి

సత్వగుణశిష్టుడౌ హరి చల్లనైన
ఆననసుధాంశుబింబము నరయుకతన
నా మది కలంతదొరగి యానందమంద
మిము ధ్యానించుచుంటి భద్రమ్ముగాగ

రాత్రివేళ నొక్క_ర్తను రమ్యతల్ప
తలమునంబవ్వళించి మీ తలపు సాగ
దూరమెన్నక మీ పాదతోయజముల
జివ్వనను లేచి వ్రాలె నా చిత్తఖగము

అమలమైన మీ పాదపద్మములజొక్కి
చెలగుచున్నట్టి మామకచిత్తఖగము
పరమసౌఖ్యానుభూతిమై ప్రబలి తెలిపె
అనఘ ! మీ సేవలోని యానందనమ్ము

జలజబాంధవవిమలదర్శనమువలన
జక్రవాకయుగంబులు సంతసించు
పగిది మీ దర్శనంపుసంపత్తిజేసి
అలరితిని మేరమీరి నే నాత్మనాథ

తాము గృహమునవసియించుతరుణమందు
సర్వసుఖములు వెన్నంటి సంచరించు
గడియ యైనను మీరు గన్పడకయున్న
విన్నదనము మొగమ్మున వ్రేలు నాథ

తమ విలోకనభృంగసంతాన మస్మ
దాననకుశేశయము నయందు వ్రాలి
పరమసౌందర్యరసము పిపాసదీర
ద్రాగుచున్నను లవమును తరుగ దార్య

దంతధావళ్యచంద్రికాధన్యమైన
మీ ముఖసుధాంశుబింబంపు మిసిమిసోక
నాదుకందోవదోయి యానందమొందు
నేను గర్వింతు నయ్యది నిత్య మనుచు

తమరు గ్రామాంతరంబేగి తరలిరాగ
చతురగమనతురంగహేషాప్రఘోష
గృహావిధినివర్తనమున చిక్కినను నన్ను
ఎదురుజూడ ప్రబోధించు నెపుడు నాథ

తమరు గ్రామాంతరమ్మున్న తడసి రేని
నాదుకందోయియందున మీదుకనులు
నాశ్రవఃపుటయుగ ననంతమధుర
మైన మీ కంఠనాదమ్మె యలరు నాథ

మీ మనోహారవిగ్రహోద్దామమహిమ
దృక్పథమునుండి తొలగక తేజరిల్లు
దాని దైవికమని మది దలచుచుంట
బుద్ధి యన్యవిధంబుగా బోవ దీశ

తొలుత నోచిననోములఫలిత మేమొ
అచ్ఛహాసప్రహాసతీక్ష్ణైకబుద్ధి
రమ్యతరమైన గాఢానురాగపదవి
హృదయసీమను నెలకొని ముదముగూర్చె

తనువునందున జీవముల్ దనరుదనుక
పూవులన్ బెట్టి మిమ్ము నే బూజసేతు
తనువు విడనాడి జీవముల్ తరలెనేని
మేలు శ్రీరంగవైకుంఠ మేలుదాన

అరుణజలజాతయుగ్మరమ్యమ్ములైన
మీదు పాదమ్ములను మది బాదుకొనిన
అచ్చపుంబత్తి తోణుకాడ నర్చనమ్ము
చేసి తరియించెదను యశశ్శ్రీలనంది

* * *

## తృ తీ యా ర్తి

భాగవతదశమస్కంధభాగమందు
భ్రమరగీతలజదువుచు పవ్వళింప
కమ్రతరరూపలావణ్యఘనముగాగ
శ్యామలాకృతి కనుల సాక్షాత్కరించె

అంత సంతోషవిభ్రమం బావరించె
దిగ్గునన్ లేచి త్రిప్పినదృష్టితోడ
అరయ నేమియు గాన్పింపదయ్యె గాని
వింటి తమప్రియవాక్కుల వీను లలర

జలదగంభీరనాదసంశ్రవణమునను
వనమయూరపుగమి మోదపడినయట్లు
మీ నుడినినాదమున్విని మిగుల సంత
సించునంతలో తా మరుదెంచినారు

ఎదుటనిలచితి రానంద మినుమడింప
త్వద్వదనభానుదీప్తిసంస్పర్శనమున
వికసితంబైన వదనారవిందమందు
నూతనవిలాసచయము సంభూతమయ్యె

సత్వగుణముంట హరితోడ సమతగల్గె
మీకు గావున నెపుడు లోకైకనాథు
ప్రతిని మిమ్మనగాగ నే చింతసేతు
ఇంతకంటెను వలసిన దేమి నాథ

మిమ్ము నిరతమ్ము ధ్యానించి మిగులబత్తి
భజనముంజేయ నా మనోవాంఛ పండె
దేవ మీసన్నిధియె నాకు దివ్యపదవి
ఎంచ సౌఖ్యాంతరమ్ము లే దింతయేని

మన్మనోహర మీ రొకమారుగూడ
మామకహృదంతరమునుండి మరలలేదు
నన్ను పరిపాలనముసేయు నాథు లగుట
విడనిభజనంబునను మిమ్ము వేడుకొందు

నాదు సంసారసాగర మీదుకొరకు
నొకయమ్యెను మీ పాదన నసేవ
ఇతరవిషయాభిలోలమై యేగనీక
తత్తరణియందు నా మది దనరజేతు

తనువులన్ భేదమేకాని తలప మనకు
ప్రియమనోహర కనరాదు భేదమెందు
ఈ శరీరభేదమును లేదేని నాథ
మన మొకరమన్న పరమార్థమహిమ కలుగు

పతిపదాంబుజసేవను బాయకుండ
దేవతాకృతియనుచు పతిం దలంచి
సకల భూతాదరణము నిచ్చలు నొనర్చి
తగ బ్రివర్తిల్లుసాధ్వియే ధన్యురాలు

జీవితేశ్వరపాదరాజీవసేవ
సేయనైనట్టి సుదతులచిత్తములకు
అనఘ తీర్థాభిగమనప్రయాస లేల
వ్రతముల న్నేమముల గల్గుబడలి కేల

ఏక్షణమ్మైన మీసేవ నేనుమరతు
ఆ క్షణం బది యుగమట్టు లగును నాకు
పండుగలు పేరటంబులై పరగుచుండు
మీరు నా దృష్టిపథములో మెలగునాళ్లు

తనివితీరదు మీ మోముతామరసము
సొబగు నహరహంబును నేను జూచుచున్న
వెర్రిననుచు లోకమ్మె భావించుననుచు
మమత కుంచింతు వీక్షణమాలికలను

మచ్ఛిరోమండనప్రభామండలములు
తమయడుగులంట నర్ఘ్యపాద్యంబు లొసగి
నాదు చేలాంచలమున మీ పాదయుగము
తడియిగుర నొత్తెదను భక్తిదనర నాథ

దీప్తిమంతము మీ మూర్తి తేజరిల్ల
కృష్ణపక్షపునిశలును కేవలమ్ము
పూర్ణిమానిశలట్టులు పొల్చు నాథ
ఎంతధన్యనో నే నైతి నింతిమీకు

పరిమళోద్గారినవ్యపుష్పముల దెచ్చి
దండలంగట్టి మీయఱుతం జెలంగ
ప్రేమ తళుకొత్తగ నలంకరించి మిమ్ము
కదలనీయక కన్నుల గాంచనిందు

కమల నెడదనుబాయనిఘను డెవండో
అవనిజాచిత్తపంకేజహంస యెవడో
భీష్మజామానసాంభోజభృంగ మెవడో
అతడు పరమాత్మ మిమ్ము కాపాడుగాత

ముఖమునందున పడతిని బూనినట్టి
బమ్మ యాయువునిచ్చుతన్ భాస్కరుండు
దేహపటుతను పెంపు పొందించుగాత
మీకు మన ప్రేమభావసు కులకును

* * *

కా వా . వ

## చతుర్థోర్మి

ప్రియమనోహర ! నన్ను దర్శింపనెంచి
నాపుట్టింటికిని ప్రణయోదయమున
తమరు చనుదెంచినారు తత్సమయమందు
కానబడనైతి సిగ్గున గదిని దాగి

ఆత్మనాథుని పరమకళ్యాణమూర్తి
అరయనీయక నాకు హ్రీభర మదేల
మానసాకాంత మాయెనం చేను దలప
మానసంబున మీమూర్తి కానవయ్యె

కాననై తిరిగా యంచు గదినివీడి
వెలుపలికి నేను రాగ నావెనుక దాగి
కన్నులారగ గాంచినకరణి మీరు
సంతసముతోడి మందహాసమ్ము సలిపి

“ ఈవు పతిభక్తిగలయట్టియింతి వనుచు
చెప్పుకొందురు పతియన్న సిగ్గదేల ”
యనుచు వెన్నంటి మీరు మాటాడినంత
పరులు విందురో యేమొ యన్ భయముగలిగ

“ ఏను పరుడనె భయమేలనే లతాంగి
ధర్మబాహ్యంబటే నన్ను తనివిజూడ ”
అనుచు సన్నగ మీరు మాటాడినంత
దవులనుండి మిమున్ గంటి తనివితీర

అభిముఖంబున నేను మాటాడకున్కి
కేవలము చూపుచేత మీ భావమందు
అరయ సంతృప్తి కలుగనిదయ్యె నాథ
కాన నను బుజ్జగింపంగ గడగినారు

“ పచ్చకప్పురమా యేమి పలుకు నీది
నీదునుడి తేనె క్రోలంగ నాదు చెవులు
తగిననోములు తొలిభవాంతరమునందు
నేని నోచవా యేమొ సుంతేని దేవి

లలితలావణ్యఖనియైన లచ్చియందు
పద్మజునిముద్దరాలైన వాణియందు
కాలకంఠునియర్ధాంగి గౌరియందు
గల గుణంబులు నీయందు గలవటె సతి

కాన నిను కన్నులార నే గాంచి కాంచి
వీనులారంగ నీనుడి విని విని విని
మనసు మరలించువాడ నామాట వినుము
మనసుదీరగ మాటాడుమా లతాంగి ”

అనెడి తమప్రియవాక్కుల నాలకించి
సిగ్గుచే ప్రతివచనంబు జెప్పనైతి
ప్రతివచన మీయకుండుట భావమందు
వ్యాకులత జెంది మెల్లన నరిగినాను

రమణ యంతట సౌధాంతరమున కేగి
వ్యాకులతతోడ పాన్పునబవ్వళించి
వేయి తలపోసితిని నాటిరేయి యెల్ల
అలుకకలిగెనోకో మారుబలుకమి నని

ప్రతివచనమీయ సిగ్గడ్డపడినదయ్యొ
అడ్డపడినట్టిసిగ్గుపై నలుక గదిసె
గాని సిగ్గునుబోనాడగానికనలు
కాంత యారేయి కడు నన్ను చికాకువెట్టె

ఈశ యానాడు నెలవున కేగినారు
తాపవార్ధిని నునుదోసె తగనిలజ్జ
నెనరుచిలుకగ నాపయి నేర్పుమీర
స్వకరలిఖితపత్రిక నొండు పంపినారు

పెన్నిధినిగన్న యల నిరుపేదమాడ్కి
హస్తమునబూని యానంద మందియుంది
లేఖ పఠియించితిని మీదు లిపికలితము
కడుప్రసన్నత నామనఃకంజ మందె

ఆత్మసంతృప్తిబొందె మీ మ్మరసినట్లె
ప్రతివచనమీని వనరు నామతిని దోలగ
ముగ్ధలకు సిగ్గుబూనుట పోలునన్న
ధర్మ మెద సుస్థిరంబుగ దలపబడియె

భిత్తికలయందు పటములు వేలుచుండ
అందు శ్రీకృష్ణరూపమ్ము నరసి దాని
తమ స్వరూపంబుగాగ నెదం దలంచి
తగ నలరియుంటి నా చిన్నతనమునందు

చద్దులం దిని నాయీడుసఖుల గూడి
మాడి వనవిహారము సల్పునాడుగూడ
అతితరమనోజ్ఞనీలమేఘాభమైన
మీదుమూరితి మరపునరాదు నాథ

మకురుతనమున చిననాడు మసలుచుండి
గారబమ్మున దినముల గడుపునాడు
అతితరమనోజ్ఞనీలమేఘాభమైన
మీదుమూరితి మరపునరాదు నాథ

అత్తవారన క్రొత్తలై యలరునాడు
ప్రేమతత్త్వంబు మదిని చిప్పిల్లునాడు
అతితరమనోజ్ఞనీలమేఘాభ నాథ
మీదుమూరితి మరపునరాదు నాకు

తోటియువిదలతోఁ గూడి యాటలాడి
పాటలన్ గొంతునెత్తి నే బాడునాడు
నీలనీరదఘృణిసమున్మేషమైన
మీదుమూరితి మరపునరాదు నాథ

దేశికునియొద్ద మేఘసందేశకావ్య
పఠనముంజేయునాడు భాస్వద్విశాల
నిటలతలభాసిముఖసమున్నిద్రమైన
మీదుమూర్తి యెడంద గంపించె నాథ

అప్పు డిప్పు డటంచు నే జెప్పనేల
మోక్షసాధకమార్గమై పొలుచు కైత
విరచనమ్మున నభిరుచి వెలయువేళ
మీదుమూర్తిని మరచి నే మెలగుటెట్లు

కరముపట్టినదాదిగ మరువలేదు
గిట్టినంతకు మరువను కేవలమ్ము
ఎన్నిజన్మల నెత్తుదు నన్నిటన్ మ
ఱెప్పటి నైన మీ కింతి నేనె నాథ

నాడు నేడును మిమ్ముల వీడకుండ
తలచుచుంటి దేవునిగ చిత్తంబునందు
తలపు పండెను ముదమయ్యె దైవకృపను
ఇంతమించి యిహపరంబు లేమిగలవు

తమ విశాలాత్మయందు పెద్దగ వసించి
నాదు మెత్తనిమనసులో నాట్యమాడి
బహుళ మానందమెల్ల రూపమ్ముగొన్న
మదనగురుడు సుఖమ్ముగ మనలమనుచు

* * *

## పంచమోర్తి

శ్రీకరుడు భక్తలోకవశీకరుండు
కంబుచక్రగదాంబుజకలితకరుడు
చారుశృంగారపీతవాసస్కుడనఘు
డర్చనీయుడు మనకు ప్రాణాధినాథ

మేలిజాజులచే సన్నమాల లల్లి
విరియబూచిన మల్లియవిరులు గూర్చి
జిలుగురేరాణిపూలు బంతులుగ గట్టి
అర్చనమొనర్తు మచ్యుతు నాత్మనాథ

వికచమందారసుమముల వేలు దెచ్చి
వలపులలరించు పొగడపూవులను దెచ్చి
సకియతో ముద్దులాడు కేశవునిగూర్చి
ఓల మోలంచు పూజసేయుదము నాథ

నందివర్ధనసుమముల పొందుపఱచి
ఫుల్లసౌగంధికమ్ములమాల ప్రోవుచేసి
లచ్చియలరారు వక్షఃస్థలంబువాని
కోర్కులలరంగ పూజించుకొంద మీశ

నిగ్గువెలిగ్రిక్కఁ బచ్చగన్నేరుపూల
కమ్మతావులజిమ్ము చెంగల్వపూల
లలితలావణ్యఖనియైన లచ్చిమగని
వలపునిలుపంగ పూజింపవలయు నాథ

బహుళకాంచనవర్ణ చంపకచయమ్ము
మంచిమొల్లల గొనివచ్చి మాలలల్లి
శ్రీకటాక్షంబులన్ జిక్కఁ జెలగువాని
పద్మనాభు నర్చింతము ప్రాణనాథ

మాలతీమృదులకుసుమమంజరులను
కాంతిమత్కరవీరలతాంతములను
తెలిమొగలిరేకుగములను తెచ్చి హరికి
సిగ నమర్తము భక్తిమీరగను నాథ

చీనిచీనాంబరములను సిరికి నిచ్చి
యంబుజాక్షున కుత్తరీయంబు నిచ్చి
చిత్రికముల ఫాలముల భాసింపజేసి
దంపతీపూజలను సేయుదము హృదీశ

మరువమును దవనంబును మాచిపత్రి
బిల్వతులసీదళంబుల వేడ్కఁ దెచ్చి
క్షణమువిడలేక మెలగు నా జంపతులకు
నర్పణము సేయుదమె హృదయాధినాథ

పూర్వజన్మల మనమును బూజసేయ
కొదువకాకుండ సంపదల్ గూర్చె నిప్పు
డట్టి సంపదలన్ బెట్టి యబ్జనిలయు
బూజసేయుదమా భవాంబునిధితరణు

నవ్యపరిమళశిశిరచందన మలంది
దీపధూపంబుల నెడంద తెలియనిచ్చి
దీప్తిమై శేషశయ్యా శ్రీదేవిగూడి
వేడుకలజొక్కు శ్రీహరి వేడు డీశ

అర్ఘ్యపాద్యంబులకునైన యంబువులను
శిరమునందున స్నానముల్ చిలుకజేసి
కంజనేత్రుని పాదోదకంబు ద్రావి
అతిపవిత్రుల మౌదుమా యాత్మనాథ

విమలపూగీలవంగాదికముల దనరి
పచ్చకప్పురపు తమలపాకువిడెము
అంబుజాక్షునకు సమర్పణంబు సేసి
చిత్తగింపుమటంచు పూజింత మార్య

కదళికా ద్రాక్ష దాడిమీ కమ్రపనస
నారికేళామ్రలికుచ ఖర్జూరముఖ్య
ఫలములనొసంగి హరిపాదపద్మములకు
ఎఱగుదము రండు నాథ మోక్షేచ్ఛ లెసగ

అబ్జభవుడు వృందు సురాధిపతియు
నారదాదిమహర్షు లానంద మొదవ
మూడుపొద్దుల నెవ్వని పూజసేతు
రట్టిహరి వరదాయకుం డగును మనకు

పాణియుగమున దేవి పదములొత్త
శయ్యయై సేవ శేషుండు సలుపుచుండ
లోకముల నేలుచుండు సుశ్లోకు హరిని
గూర్చి పూజింతము పదండు కోరి నాథ

భరతశతుఘ్ను లంగదవాయుసుతులు
జాంబవంతుడు నీలుండు సరణిగొల్వ
రత్నసింహాసనంబెక్కి రమణితోడ
పుడమి నేలెడి రాముడు ప్రోచు మనల

ఏమహాదేవి లోకమ్ము లేలగల్గి
ఒక్కరుడు తన్ను నేలంగ నొదిగియుండి
పురుషగౌరవమును జగంబులకుజూపు
ఆపె దేవి మనల గాపాడు నాథ

***

కావ్యావళి

శ్రీరంగనాయక శ్రీశేషశయన
వీరదానవగర్వవిధ్వంసి రంగ
పారిజాతాకార ప్రణవానుకార
నారీజనాలోల నలినాక్ష రంగ
యోగిమానసలసదోంకారరూప
యోగిసంభావితాభ్యుదయ శ్రీరంగ
అఖిలమౌక్తికరత్నహార కేయూర
నిఖిలతత్త్వా త నిఖిలాత్మ రంగ
శంకావినిర్ముక్తసద్భక్తవర్య
కైంకర్యవత్సల కరుణాత్మ రంగ
చందనలసితచర్చాభూషితాంగ
కుందేందుసిత ర్తి కోమలరంగ
చెలువైన పూర్వాద్రిశిఖరమ్మునందు
వెలుగు భానునిరీతి విలసిల్లురంగ
దొరసి కవేరజాదుగ్ధాంబునిధిని
పరిపూర్ణ విధుడవై భాసిల్లురంగ
పరమైన శ్రీరంగఫలవృక్షమందు
పరిపక్వఫలమౌచు భాసిల్లురంగ

పావనసుజనేష్ట ఫలదానమందు
దేవధేనువు నీవె దివ్య శ్రీరంగ
అజ్ఞాన ఘోరసాందాంధకారమున
సుజ్ఞానదీప్తివై శోభిల్లురంగ
బలవదుగారాతిబలసముద్రముల
కలచు బాడబమీవె గంభీరరంగ
విమలసజ్జనకష్టవిపులాంధకార
కమలాప్తబింబమై కాల్రిలు శ్రీరంగ
విలసితాత్మసుభక్తవిమలాంతరంగ
జలరుహామధుపానషట్పద రంగ
అరినృపప్రాణానిలాహారభుజగ
వరభుజాంతరవాసిభార్గవి రంగ
రాజమహారాజరాజ శ్రీరాజ
రాజమార్తాండశ్రీరాజ శ్రీరంగ
పరమేశ యవ్యయ పరమకళ్యాణ
పరమాత్మ అపరోక్షభాసి శ్రీరంగ
కందు నీరూపంబు గనులార నిందు
ఇందిరాసుందరి నేలిన రంగ
ఆకలిగొంటి నే నరయంగ నిన్ను
ప్రకటంబుగ నిట్లు ప్రార్థింతు రంగ
శ్రితజనావ నెల్ల జేరి రక్షించి
గతిజూపగా నీవు ఘనుడవు రంగ

కా వా - వ

మతిలేక భ్రమజెంది మరలజాలకయ
ప్రితతసంసారాబ్ధి బడితిని రంగ
నీ పాదసేవ నా నెమ్మది న్నిల్పి
ఈ పాపవారిధి నీదుదు రంగ

సతతమ్ము గతివంచు జలజాక్షు నిన్ను
మతిలోన ధ్యానమ్ము మఱిజేతు రంగ
నీకన్న మఱిలేరు నెనరుచుట్టాలు
నాకు నీవేదిక్కు నమ్మితి రంగ

ఇతరుల వేడంగ నెంచదు మనసు
మతము నీయదెతప్ప మఱిలేదు రంగ
ఎందుజూచినగాని యేర్పడన్ నీవె
ముందుగా గననౌదు మోహానరంగ

నీలమేఘశ్యామ నీరూప మేను
ఆలోకనము సేసి యలరుదు రంగ
పాపహారంబులౌ పాదపద్మముల
తాపంబు నశియింప దయజూపు రంగ

శ్రీవత్సకౌస్తుభశ్రీలచే వెలుగు
నీవక్షమునుజూడ నియమింపు రంగ
ఆశ్రితలోకంబున కభయంబునిచ్చు
శ్రీగల్గిననిన్ను స్మరింతు రంగ

కాంతి ముత్యంబుల కడదోసినట్టి
దంతధావళ్యంబు దలచెద రంగ

పగడంపుకాంతుల పరిహాసించుచును
నెగడు నీ యధరమ్ము నే నెంతు రంగ
చంపకసుమముతో సమత భాసించు
సొంపైననాసిక జూపుమా రంగ
నీరజంబులమించు నీ యక్షియుగము
ధీరభక్తులుదెల్ప దెలిసితి రంగ
శ్రీలక్ష్మి చుంబించు చెలువుటద్దముల
లాలించు చెక్కిళ్ల లక్షింతు రంగ
అర్ధచంద్రాకృతి నలరు నెన్నుదురు
అర్థింతు జూపు నా యాత్మలో రంగ
పొంకంపువిలు నేలు భ్రూలతన్ గాంచ
అంకురించెనుకోర్కి యది తీర్పు రంగ
అళిసమూహము గేరునట్టి ముంగురులు
గలుగు నీ శిరమును గాంచెద రంగ
నానావిభాదీప్తనవరత్నమకుట
మానితమా ని మతిగాంతు రంగ
అబలాభిమానివై యలరెద వనగ
ప్రబలసాక్ష్యమ్ము ద్రౌపది నాకు రంగ
వేదసారార్థంబు వెదుకంగలేను
నీదయయే నాకు నిఖిలంబు రంగ
జపములు వ్రతములు సలుపంగలేను
తపమంచు నిన్నిల్లు దలచెద రంగ

ప్రోవుమా నా పాపపుంజంబు తొలగ
కావుమా నన్నిందు కమలాక్ష రంగ
ఇల గజానీళుని నెట్లు ప్రోచితివో
పొలుపొంద నారీతి బ్రోవుమా రంగ
గౌతమపత్నిని గాచినరీతి
పాతకంబులుబాపి పాలింపు రంగ
వాయుపుత్రునిమీద వరలిన ప్రేమ
పాయక నాయందు పఱపుమా రంగ
తనర ప్రహ్లాదుపై దయజూపినట్లు
అనయ మీయబలను నరయుమా రంగ
ధ్రువుని నేరీతి విలోకించినావో
భవభీత నన్నట్లు పాలింపు రంగ
అంబరీషున కిచ్చినట్టి మోక్షంబు
సంబరమ్మున నా కొసంగుమా రంగ
వైదర్భి నిన్నెద వాంఛింప బ్రేమ
గాదనలేక వే గైగొంటి రంగ
పాతకంబులజేసి పాపినినైతి
నీతప మికనైన నేజేతు రంగ
నీలమేఘముబోలు నీమేనిచాయ
ఏలజూపవునాకు నెటుపోదు రంగ
కలువరేకులబోలు కందోయిసొబగు
వలచితి నేల కన్పఱపవో రంగ

ఇందుబింబముసొంపు నేలు నీమోము
అందముంగనజేయ వదియేల రంగ

కమలానివాసమ్ము ఘనవక్ష మందు?
తమిదీరజూపుమా దళితాఘ రంగ

కనకచేలాంచితకటిసీమవాని
నిను మనంబునజేర్తు నియతిఁ రంగ

తాపసవ్రాతమ్ము ధ్యానమ్ము సేయు
నీపదమ్ములు పూజనీయముల్ రంగ

పరిపూర్ణరూప నాభావంబునిండ
మఱిమఱిగాంతు నీ మహిమంబు రంగ

ఆదినారాయణ యఖిలలోకేశ
నీదానరా నేను నిఖిలాత్మ రంగ

పరిఫుల్లకుసుమసంభారమ్ముతోడ
నిరతమ్ము నీపూజ నెఱవేర్తు రంగ

భావించి ర్తించి ప్రార్థించి పూజ
కావించి మ్రొక్కెద కమలాక్ష రంగ

సేవింతు నభిమతసిద్ధికై నిన్ను
గావింపరామేలు కంజాక్ష రంగ

బంగారుపతకముల్ పదివేలు తెచ్చి
రంగారగానిత్తు రాజ శ్రీరంగ

భక్ష్యభోజ్యంబుల వలచెద వేని
లక్ష్యముంచి రచించి లలిగూర్తు రంగ

ఇందుబింబముసొంపు నేలు నీమోము
అందముంగనజేయ వదియేల రంగ
కమలానివాసమ్ము ఘనవక్ష మందు?
తమిదీరజూపుమా దళితాఘ రంగ
కనకచేలాంచితకటిసీమవాని
నిను మనంబునజేర్తు నియతి శ్రీరంగ
తాపసవ్రాతమ్ము ధ్యానమ్ము సేయు
నీపదమ్ములు పూజనీయముల్ రంగ
పరిపూర్ణరూప నాభావంబునిండ
మఱిమఱిగాంతు నీ మహిమంబు రంగ
ఆదినారాయణ యఖిలలోకేశ
నీదానరా నేను నిఖిలాత్మ రంగ
పరిఫుల్లకుసుమసంభారమ్ముతోడ
నిరతమ్ము నీపూజ నెఱవేర్తు రంగ
భావించి కీర్తించి ప్రార్థించి పూజ
కావించి మ్రొక్కెద కమలాక్ష రంగ
సేవింతు నభిమతసిద్ధికై నిన్ను
గావింపరామేలు కంజాక్ష రంగ
బంగారుపతకముల్ పదివేలు తెచ్చి
రంగారగానిత్తు రాజ శ్రీరంగ
భక్ష్యభోజ్యంబుల వలచెద వేని
లక్ష్యముంచి రచించి లలిగూర్తు రంగ

మరువమ్ము దవనమ్ము మాచిపత్రియును
కురువేరు చేమంతి గూర్చెద రంగ

అల్లిబిల్లిగనల్లు నందంపుచలువ
మల్లెపందిట బత్తి మదినిండ రంగ

మందిరమ్మునునిల్పి మర్యాద లెసగ
బృందావనంబులో వెలయించి రంగ

సింగార మొనరింతు చెలువు నల్దెసల
రంగారగా నీవు రాణింప రంగ

బాలరూపముతోడ పలుముద్దులొలుకు
నీలమేఘముదీప్తి నిండిన రంగ

సిగచుట్టు ముత్యాలచేరులు గదల
మొగమున నిగ్గులు మురియంగ రంగ

ఘనరత్న తాటంక కాంతులు దెసల
ఇనసమ తేజమ్ము నెనయింప రంగ

శ్రీవత్స కౌస్తుభ శ్రీవిలాసముల
శ్రీవిలాసమ్ముగ జెలగిన రంగ

ఒకకరాబ్జము కటి నొప్పుగా జేర్చి
ఒకపాణి నవనీత మొప్పగా రంగ

మొలకట్టుగజ్జెలు ముద్దులుగులుక
బలమైనయూరువుల్ భాసిల్లు రంగ

శంబరరిపుకోటిశతవిగ్రహముల
డంబైన నీమూర్తి డంబంబు రంగ

చేరి భక్తిరసమ్ము చెలువారు కనుల
చూడగోరెదనయా శుద్ధాత్మ రంగ

నవనీతచోర నందకుమార
భవపాపనాశన పావన రంగ

మలచిమదిన్ వేఱు మాటలనుండి
నిలిపి పూజించెద నీమూర్తి రంగ

సర్వలోకాధార జగదేకవీర
శర్వాది దేవతాసంస్తవ్య రంగ

దివ్యలక్షణకళా దేదీప్యమాన
అవ్యయ అసమాన అఖిలేశ రంగ

భవ్యచిదానంద పరమకళ్యాణ
దివ్యచారిత్ర సుధీనుత రంగ

గుణగణాలంకార కోమలాకార
ఫణిరాజశయన శ్రీపతి దేవ రంగ

చిదిమినపాల్గారు చెక్కిళ్లు గలిగి
ముదిత యశోదకున్ ముద్దైన రంగ

గజ్జె లందియలు ఘల్ ఘల్లని మోగ్రియ
ముజ్జగంబుల మోహమునముంచు రంగ

ముద్దులన్ గుల్కుచు మురియుచున్ మిగుల
గద్దరివై యాడు ఘనుడవు రంగ

గోవత్సములగాయ కోమలపాణి
శ్రీవేణువలరించి చెలగుదు రంగ

పచ్చలపతకమ్ము ఫాలమం దలరి
స్వచ్ఛంపుకాంతులన్ చల్లగా రంగ
నిలువుకస్తూరిబొట్టు నీడలు గులుక
బలువైనభుజ ర్తి భాసిల్లు రంగ
కర్ణంబులను పాలకాయలు గదల
స్వర్ణోత్తరీయశోభలు దేరు రంగ

***

మిసిమిమిగడపాలు మెసవుచున్ మిగుల
పసితనమ్మున ముద్దుభాసిల్లు రంగ
పొట్టనిండనుమెక్కి పొదరిండ్లడాగి
దిట్టవై మెలగిన ధీనుత రంగ
ఆగములవలదురాయని తల్లి తెల్ప
భోగి గిట్టగజేసి పొలచితి రంగ
పూతనయను నొక్కపొలతిని జంపి
ఆతతసత్కీర్తినందిన రంగ
శకటరాక్షసుబట్టి శౌర్యంబుమిగుల
అకలంకమతి జేల్చినట్టి శ్రీరంగ
వాయుతృణావర్తు వడి సంహరింప
ఆయతశక్తిమై నలరిన రంగ
మోహమునవంశంబు మోగించుచుండ
భామలు నినుజూచి భ్రమసిరి రంగ
చెన్నారుమకరికల్ చెక్కిళ్లదిద్ది
పన్నీరు కుంకుమన్ పై పూతు రంగ
నుదుట కస్తురిబొట్టునునుపు బింబింప
ఎదుటనద్దముబట్టి యీక్షింతు రంగ

ఘనసుందరుడవైన కమలాక్షు నిన్ను
మనమున నేపొద్దు మరువను రంగ

పదియారువేలవ్రేపడతులు గోరి
ఉదయాస్తమయముల నూహింతురి రంగ

మునుకొని ధ్యానించి ముగుదలెల్లరును
ఘను నీదుసన్నిధిన్ గాంచిరి రంగ

నిన్నునమ్మిన గొల్లనెలతల కెల్ల
పన్నగ వైకుంఠపద మీవె రంగ

ఏరీతి నీవు నన్నేలెదో గాని
భారమయ్యెను జన్మ పద్మాక్ష రంగ

మానవంతుడవని మదిని నమ్మితిని
మానిని ననుబ్రోవుమా శ్రీశ రంగ

ఏనాతి నినుబట్టి యెందుదాచినదో
కానరా వీ వెందుగలవో శ్రీరంగ

ఆనలన్ బెట్టి యేయతివ నిన్నాపె
కానరా వీ వెందుగలవో శ్రీరంగ

ఘోరకాంతారముల్ గ్రిమ్మరిల్లితిని
పారిపోతివి పట్టుబడవు శ్రీరంగ

పారెడినదులను పరికించినాను
పారిపోతివి పట్టుబడవు శ్రీరంగ

వారాశిలో దృష్టిపఱపి చూచితిని
పారిపోతివి పట్టుబడవు శ్రీరంగ

గిరి వలగొని మీాదు క్రిందు వెదకితి
దొరకవు నీ వెందుతొలగితో రంగ
తరుచైనధరణిని త్రివ్వి వెదకితి
దొరకవు నీ వెందుతొలగితో రంగ
భారంపుకంబాన బరగ వెదకితిని
పారిపోతివి పట్టుపడవు శ్రీరంగ
కురుచగా నెందున కూరుచుంటివో కో
పరికింపబడవు శ్రీపతి దేవ రంగ
పీరవైరుల చెండ వెడలితివో క్రో
తారసిల్ల వదెందు ధవళాక్ష రంగ
గురుతరక్షాత్రిమ్ము కుదురు నీ కనగ
పరికించితిని పట్టుబడవు శ్రీరంగ
కలుకైననాగేళ్లు గలవారియందు
పరికించితిని పట్టుపడవు శ్రీరంగ
పరమధర్మంబులు పాలింపలేక
తరలిననీ వెందు దాగితో రంగ
బరువైనధరణికి భారమ్ము దీర్ప
తరలిననీ వెందు దనరితో రంగ
అష్టభార్యలసౌఖ్య మాత్మలో మరగి
ఇష్టుడవై నను నేలవో రంగ
ఎటుల గావించిన నేను నీదాన
పటుతర నీమూర్తి భావింతు రంగ

యెరుగక యే చేయు నేపాపమైన
పరగ గణింపుట పాడియా రంగ
నిన్ను నమ్మినమమ్ము నెనరుతో బ్రోచి
కన్నతండ్రికి వోలె కావవే రంగ
ఈవు గాదన్నచో నెవ్వరు మాకు
కావంగ నేలిక కలడు శ్రీరంగ
ఈరూపమును దాల్చి యే నుందు ననవె
ఆరూపమున నిన్ను నర్చింతు రంగ
పూజింతు నారూపు పొలుపైన దంచు
పూజింతు నాకోర్కి పొందగా రంగ
పూజింతు నిను పాపపుంజంబు దెగడ
పూజింతు పుణ్యముల్ పొందగా రంగ
పూజింతు పతిసేవ పుణ్యాదం బంచు
పూజించి నే ముక్తి బొందెద రంగ
ఎవని పూజింప సర్వేష్టముల్ గల్గు
అవని నామూర్తి నీ వౌదు శ్రీరంగ
కోరను ధనముల గోరను భువిని
కోర హర్మ్యాదుల గోర శ్రీరంగ
కోర నంబరముల గోర భూషలను
కోర పుత్రాదుల గోర శ్రీరంగ
కోర రాజ్యాదుల గోర బందుగుల
కోరను మోక్షమ్ము గోర శ్రీరంగ

కోరిన దొక్కటే కోర్కె నాకయ్యె
మారాడక యొసంగుమా దేవ రంగ

పతిరంగనాథునిపాదసంసేవ
సతతమ్ము గోరెద జలజాక్ష రంగ

పతి రంగనాథుడై పరగిననీవు
గతివయి నన్నిందు కడతేర్చు రంగ

మరణకాలమునందు మానసమ్మునను
వరుమరువనికోర్కె వాంఛింతు రంగ

వరమిమ్మునా కిదేవాంఛ గావునను
నిరతమ్ము నమ్మితి నిన్నె శ్రీరంగ

ఇంతకన్నను నాకు నిహమును లేదు
ఇంతకన్నను పరంబే లేదు రంగ

తనకులధర్మమ్ము తగదందు వీడ
మునుకొని సంసారమునునుండి రంగ

నీసేవ నిరతంబు నే జేయుచుండ
కాసంతవిఘ్నమ్ము గానీకు రంగ

కంసారి నీసేవ గావించుపట్ల
సంసారభారమ్ము సమయింపు రంగ

ప్రబలసంసారవారాశితీరమ్ము
అబలనై నే జేరనైతిని రంగ

నీసేవ జేయుచు నిన్నె ధ్యానించి
వాసిగాంచగ నెప్డు వాంఛింతు రంగ

నిను నిరాకారుని నే నెంచలేను
మనవిజేసితి నీకు మన్నింపు రంగ

మ్రొక్కెడివారల మొనసి వీక్షించి
క్రిక్కున నవ్వారి గరుణింతు రంగ

పతి జూచి నిను జూచి భావమ్ములోన
కుతుకమ్ము నెందెద గుణలోల రంగ

ఇరువురికిని భేద మెందు లే దనుచు
నిరతంబు భావింతు నేను శ్రీరంగ

శ్రీరమారమణీశ శ్రితజనాధార
కారుణ్యధామ శ్రీకళ్యాణరంగ

శ్రీరంగనాయక శ్రితపారిజాత
శ్రీరమ్యరూప నిర్జితదైత్య రంగ

నవమోహనాకార నవనీతచోర
భవరోగసంహార భవ్య శ్రీరంగ

జీమూతనిభగాత్ర చిత్రచారిత్ర
సామవేదస్తుత సర్వేశ రంగ

ఎచటనోగలవని యెంచంగ నేల
ఇచటనే మత్పతి వీవౌదు రంగ

పతిరంగనాథుగా భావమం దెంచు
సతిని నే పతిపూజ సలుపుదు రంగ

అనఘు నాపతి బాయనట్టి సద్వరము
నెనరుతో నా మ్మ్ము నిఖలేశ రంగ

నీభక్తిభావమ్ము నిండించుదాన
నాభర్తయందున ననుగావు రంగ

అతివలకెల్లర కఘహారమైన
పతిసేవ నే జేతు భక్తితో రంగ

అరయ రజోగుణం బాకృతింబూని
విరచింతు లోకముల్ విధిరూప రంగ

సత్వస్వరూపంబు చాలంగబూని
సత్వాళి రక్షింతు జలజాక్ష రంగ

కలితతమోగుణాకారమ్ముబూని
విలయింతు సృష్టిని విశ్వేశ రంగ

ప్రాకటంబుగ నీ గుణాకర్ణనమ్ము
శ్రీకరంబుగ ముక్తజేయును రంగ

ధ్యానమ్ము చాలంటి ధన్యునింజేర
ధ్యానింప నిన్‌వినా దైవమ్ము రంగ

మనమున వాక్కున మహితకర్మమున
తనరునేకత నిన్ను దలతు శ్రీరంగ

త్రిగుణాత్మకంబైన దివ్యంబునైన
సగుణమూర్తిని నుపాసనజేతు రంగ

చతురుపాయైకశాశ్వతరాజ్యరూపు
నుతియింతు సీతామనోనాథు రంగ

పంచేంద్రియంబుల బట్టి నేమించి
చంచన్మనోదృష్టి చర్చింతు రంగ

పంచభూతాత్మకపరిద్యోతమానస
కాంచనచేల లోకస్తుత్య రంగ

నవభక్తిపథముల న నాకు నిన్ను
పరివిమలాత్ముని గోరి ప్రార్థింతు రంగ

నీ పదార్చావిధి నే గోరుదాన
నీ పదర్చకసక్తి నియమింపు రంగ

భూతసంతానపరిభూతసత్కరుణ
చైతన్యరూప ప్రసాదించు రంగ

విద్యోరుబుద్ధుల వినయంబుగలపి
గద్యపద్యాత్మకకవనమ్ము రంగ

గలపజేసినయట్టి ఘనుని నాభాగ్యత
గలపినగురు * సతి గావింతు రంగ

పతిపేరు శ్రీరంగపతియాట సతము
మతి నిన్ను భావింతు మతిమతి రంగ

నా నేర్చినట్లు ని న్నానావిధముల
పూని వర్ణించితి పోరివుమా రంగ

వేదవేదాంతాదివిద్యాపరివేద్య
ఈ దీనురాలి నీకు నింపౌనె రంగ

* సహస్రావధాన చతురానన
బ్ర. వే. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.



కా వా

బత్తి పేర్శేపింప వ్రాసితి గాని
సత్తి యరయలేదు జలజాక్ష రంగ
కౌసరి యాత్రేయసగోత్రమ్ముననగుచు
పసనొప్పు కాళ్లూరివంశంబు రంగ
అంచు నే జననంబునందినదాన
ఇందుమత్యభిధాన నేనౌదు రంగ
ధీరజోగారాయదీక్షితవరుడు
గారాబుగా నన్ను కన్నయ్య రంగ
అగును లక్ష్మీనరసాంబ నాతల్లి
సుగుణసంచయపేటి స్తుతియింతు రంగ
రాజతంత్రజ్ఞుండు రాజితశ్రీ
రాజేశ్వరుడు కృష్ణరావు శ్రీరంగ
గోపాలరావు నా గుణు లగ్రజన్మ
లేపున వీక్షింపవే వారి రంగ
రహి తాయ సత్య సరస్వతుల్ నాకు
మహి ముప్వురక్కలు మహనీయ రంగ
నీ దయాదృష్టుల నిండుతన్ మాకు
సౌదర్యభావము జలజాక్ష రంగ
గురు భరద్వాజసగోత్రుండు ధరణి
వరసోమరాజాన్వయుండు రంగ
శ్రీరామచంద్రరాట్ సుకుమారుండు
శ్రీరంగరావు నన్ జేపట్టె రంగ

ఉభయవంశంబుల నోమంగ నిన్ను
అభయప్రదాతను నర్థింతు రంగ
ఆచంద్రతారార్కమై యొప్పు ద్విపద
నా చారురచన నానందింపు రంగ
అక్షయసౌభాగ్య మర్థింపుచుంటి
వీక్షించి యొసగవే విమలాత్మ రంగ
స్వస్తి నీ కగుగాత సనకాదివంద్య
స్వస్తి లోకములకు సంధింపు రంగ
మంగళం బిదె నీకు మహనీయరూప
పొంగుచు గైకొని ప్రోవుమా రంగ
జయమంగళం బిదే జయమంగళమ్మ
జయ శుభసంధానసచ్ఛీల రంగ

***

శ్రీదేవికరముల చెలువున కుద్దియై
విలసిల్లు కెందమ్మివిరుల దెచ్చి
క్షీరసాగరకన్య చిఱునవ్వుచాయకు
దోరమైన తెలిమల్లెసరుల గూర్చి
ఇందిరాసుందరీసుందరాస్యముతో
సరియైన వారిజోత్కరము నేర్చి
మంగళదేవతామంజునాసికబోలు
సొగసైన తావిసంపెగలు గూర్చి
నిన్ను బూజింతు సద్భక్తి నియతి నెపుడు
మాకు నన్యోన్యరాగసంపత్తి నిడుము
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఈశిరంబంటించి యెన్నడు మ్రొక్కుదో
పరభాగ్యదంబు శ్రీహరిపదంబు
ఈనేత్రయుగమున నెన్నడు గందునో
కరుణాలవాలు భాసురకపోలు
ఈకర్ణయుగళిచే నెన్నడు విందునో
అమృతంబులొలుకు దయాళుపలుకు
ఈకరంబున నెన్న డెరగి పూజింతునో
సలలితశ్రీవత్సకలితవక్షు
అనుచు నాయింద్రియావయవా చెయ్వు
లెల్ల నీకర్పణము సేయ నెంచుచుందు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

జగదీశ్వరుండవై జగములపాలించు
కరుణాకటాక్షవీక్షణము నీది
భూతేశ్వరుండవై భూతసంతానంబు
పోషించు తళుకునెమ్మోము నీది
గోపాలకుండవై గోపుల నెలయించు
బహుకోటిమదనరూపంబు నీది
స్వజనసంతాత్రివై గజభీతి బాపిన
అభయముదాంకమహస్సు నీది
వేదవేదాంతవాక్యార్థవేద్య డీవు
నిన్ను నిరతంబు మదిలోన నిల్పుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పరమపవిత్రతకైన పద్మరేఖలు గల్గి
అహిమూర్తాండవం బాడె నెద్ది
బహుయశోనిధియైన బలిచక్రవర్తిని
పాతాళభూమికి బంచె నెద్ది
భర్తృశాపంబున బండయైపడియున్న
చెలి యహల్యకు మూర్తిజేసె నెద్ది
కన్నెనిచ్చెడివేళ గడలిచే బంగారు
పళ్లెరాన కడగబడియె నెద్ది
భక్తజనమానసంబుల సక్త మెద్ది
అద్ది నీపదాంబుజము ధ్యేయంబు నాకు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పలుకుపల్కున తేనెలొలుక బల్కెడివేళ
కలికిచిల్కలు మాటగరచుచుండ
రామరామా యంచు రమణబాడెడివేళ
కొసరికోయిలచాలు కూయనేర్వ
నీలనీరదము వేణీభరంబును జూచి
నెమ్మిమొత్తమ్ము నాట్యమ్ముసేయ
మందయానమున నందందున దిరుగాడ
మత్తేభములు యానమహిమనేర్వ
అరసి మోదమునంది యర్ధాంగిసీత
ఆదరించిననీవు నన్నరయ వేమి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

జయ దేవ పుత్రి జయ నీరదశ్యామ
జయ జగత్పూజిత జయము జయము
జయ భక్తపాలక జయ ధర్మవిధిసాధ్య
జయ రమాహృత్కాంత జయము జయము
జయ పుండరీకాక్ష జయ మహానలభోక్త
జయ జలజాతాక్ష జయము జయము
జయ సత్యపాలన జయ నిత్యకళ్యాణ
జయ ఘనలావణ్య జయము జయము
జయ సకలజగత్కారణ జయము జయము
జయ సురవాతపూజిత జయము జయము
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

మునిమనోంబుజవాస ఘనకిల్బిషవినాశ
శ్రీరమాహృదయవిహార వరద
యాదవనందనా యమపాశఖండన
దీనాతార్తికృంతన భవ్యశీల
రఘుకులోద్ధారక రణరంగభీకర
సీతానుజతృతీయ చిత్స్వరూప
ధర్మావతార సత్కర్మాచరణలోల
రాధికాలోల యారామఖేల
పరమమునిగణసన్నుతభవ్యనామ
నిన్ను నిరతంబు నెడద ధ్యానించుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

అలనాడుపాంచాలి వలువలుగోరంగ
ఇచ్చి కాపాడినయీశు డెవడు
దేవతల్ మొరపెట్ట కావగ నూహించి
వెడలి రక్షించినవీరు డెవడు
ప్రహ్లాదు డతిభక్తి బ్రస్తుతింపగ మెచ్చి
స్తంభము వెడలినధన్యు డెవడు
శరణన్నమాత్రాన కరుణచే కాకంబు
గాచి ప్రోచినమహాఘను డెవండు
అట్టి పుణ్యాత్ముడైన సర్వాత్మ నిన్ను
తలతు సార్థకమై జన్మ తనరుకొరకు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీచరిత్రంబుల నియతిమై విన జారు
ఆనందబాష్ప మర్ఘ్యంబు గాగ
నీ కీర్తనరతనియతిజాతము నమ్ర
తప్రసారంబు పాద్యంబు గాగ
నీప్రభావంబు వర్ణించి వ్రాసిన పద్య
మాలిక నవపుష్పమాల గాగ
నీగుణంబుల వ్రాయు నిఖిలాక్షరంబులు
చరణపూజాశుభాక్షతలు గాగ
నీకు లోనైన నాయెద నెరివెడంద
పీఠముంగాగ నాతిథ్యవిధి నొనర్తు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఏపుష్పసముడవో యేపత్రరూపివో
ఏజాతివాడవో యెరుగరావు
ఏగ్రావరూపివో యేశైలరూపివో
ఏజాడనుంటివో యెరుగరావు
ఏభాగ్యరేఖవో యేసాధుమూర్తివో
ఏమూలదాగితో యెరుగరావు
ఏచిత్రనటుడవో యేదేహధారివో
ఏచక్కనున్నావొ యెరుగరావు
నీగ్గరితనంబు నెచట నేర్చితివొ కాని
నన్ను నెలయింప నీకొక తెన్ను గాదు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పాలువోంగిల రోట పట్టిబంధింపంగ
కాయంబు పెంచినఘనుడ వీవె
మన్నేలతిందువో యన్నతల్లికిని లో
కము నోటజూపినఘనుడ వీవె
తల్లివద్దను పాలు తగురీతిద్రావుచు
కొండంతబరువైనకొడుకు వీవె
యాదవాంగనవోలె నరుదెంచి పాలిచ్చు
పూతనజంపినపుణ్యు డీవె
శకటరాక్షసు గూల్చినశౌరివీవె
పుడమిరాజుల కాధారభూతు డీవె
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

యజ్ఞంబులను జపయజ్ఞంబు నీవాదు
పర్వతంబుల హిమవంతు డౌదు
అఖిలవృక్షములందు నశ్వత్థ మౌదువు
ఋషులందు నారదఋషియు నౌదు
గంధర్వులందున ఘనచిత్రరథు డౌదు
సిద్ధులందు గపిలసిద్ధు డౌదు
తతవనంబులను బృందావనం బౌదువు
దంతుల నైరావతంబ వౌదు
ఆయుధంబులలోన వజ్రాయుధమవు
ధేనువులయందు నల కామధేను వౌదు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.



కావ్యా

సుందరాకృతులందు సుమశరుడందురు
ఫణులందు వాసుకిఫణి వటందు
వారివాసులలోన వరుణుండ వందురు
దండించుటన్ దండధరుడ వందు
మనుజులందున మహామనుజాధిపతి వందు
అసురులలోన ప్రహ్లాదు డందు
రలపితృదేవుల నర్యము డందురు
పరగ మృగంబుల హరివ టందు
తలప పక్షులలో గరుత్మంతు డందు
బహుళవేగగాములలోన పవను డందు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

అరయ నాగులలోన నాదిశేషుడ వీవ
ముల్లోకముల మృత్యు వల్ల నీవ
శస్త్రధారులలోన శౌరి రాముడ వీవ
మత్స్యంబులందున మకర మీవ
విద్యలందున బ్రహ్మవిద్య వగుదు వీవ
ఘనవాహినులయందు గంగ వీవ
వాదంబులను తత్త్వవాదం బగుదు వీవ
అక్కరాల నకార మాదు వీవ
అక్షయంబగుకాలంబ వగుదు వీవ
సృష్టికర్తవు నీవ రక్షింపు నన్ను
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

సుందరాకృతులందు సుమశరుడందురు
ఫణులందు వాసుకిఫణి వటందు
వారివాసులలోన వరుణుండ వందురు
దండించుటన్ దండధరుడ వందు
మనుజులందున మహామనుజాధిపతి వందు
అసురులలోన ప్రహ్లాదు డందు
రలపితృదేవుల నర్యము డందురు
పరగ మృగంబుల హరివ టందు
తలప పక్షులలో గరుత్మంతు డందు
బహుళవేగగాములలోన పవను డందు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

అరయ నాగులలోన నాదిశేషుడ వీవ
ముల్లోకముల మృత్యు వల్ల నీవ
శస్త్రధారులలోన శౌరి రాముడ వీవ
మత్స్యంబులందున మకర మీవ
విద్యలందున బ్రహ్మవిద్య వగుదు వీవ
ఘనవాహినులయందు గంగ వీవ
వాదంబులను తత్త్వవాదం బగుదు వీవ
అక్కరాల నకార మాదు వీవ
అక్షయంబగుకాలంబ వగుదు వీవ
సృష్టికర్తవు నీవ రక్షింపు నన్ను
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ద్వాదశాదిత్యులం దనరువిష్ణుడ వీవ
రిక్కమొత్తమున రేరేడ వీవ
వేదంబులను సామవేదమూర్తివి నీవ
సురలయందును సురేశ్వరుడ వీవ
ఇంద్రియంబుల మానసేంద్రియంబును నీవ
తగభూతములను చైతన్య మీవ
చెలగి రుద్రులలోన నలశంకరుడ వీవ
పరగ యక్షుల ధనపతివి నీవ
అష్టవసువులయందున నగ్ని వీవ
ధారుణీధ్రములందున మేరు వీవ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నిత్యప్రకాశకనిచయంబున న్నిన్ను
ఆదిత్యగణ మని యందురయ్య
వరపురోహితులలోపల నెంచి చూడ బృ
హస్పతి వని నిన్ను నందురయ్య
సేనాధినేతృరాజిని నగ్రగణ్యుడౌ
షాణ్మాతురుం డనజాలుదయ్య
అమలినసలిలాశయప్రకాండంబున
అంభోధి వీవని యందురయ్య
శబ్దముల నీవు ప్రణవసుశబ్ద మండ్రు
ఋషులలోనను భృగుమహాఋషి వటండ్రు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కరములా మృదుబిసకాండసౌందర్యధి
క్కారు లంచును తోడికాంత లెన్న
దంతములా కుందధావళ్యసుశ్రీవి
లుంటాకములు నా జెలులు వచింప
చక్షువులా నీరజాతాభిరూపతా
సోదరు లని సాటిసుదతు లెన్న
నుడువులా నిర్జరానోకహాప్రసవమా
ధుర్యహారు లని పొల్తులు వచింప
మోహినీరూపివై సోకుమూకగముల
అడచి యమరుల కమృతంబు నిడవె నీవు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఓకృష్ణ ఓజిష్ణు ఓయిరామానుజ
ఎంత వేడినబల్కవేమి సేతు
మౌళిధృతబర్హ ఓభర్మపరిధాన
ఎంత వేడినబల్కవేమి సేతు
సత్యాలోకేశ ఓవ్రజవనితేశ
ఎంత వేడినబల్కవేమి సేతు
ఓసురార్చితపాద ఓదీనబాంధవ
ఎంత వేడినబల్కవేమి సేతు
భక్తజనపాల గోపాలబాల పిలువ
లే నెలుంగెత్తి వాపోవలేను నేను
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

అతులవిలాసరూపాంచితనీల దే
హంబుభావము జలదంబునందు
ఆకర్ణదీర్ఘ నేత్రాంత సౌభాగ్యంబు
కమనీయపుండరీకంబునందు
ముగ్ధమోహనమైన ముఖము సౌందర్యంబు
పార్వణచంద్రబింబంబునందు
విశ్వసమ్మోహన వేణుసంగీతని
స్వానమ్ము వన్య చకమునందు
కని మురియునాకు నీవె సాక్షాత్కరింప
కలుగుమోదంబునకు నంతు కలుగునొకొ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పరమపావనమైన పదములభాగ్యమ్ము
పద్మంబులందున భద్రపరచి
విమలబృందావనగమనలోలత్వమ్ము
మదగజంబులయందు గుదురుపరచి
ముడికి నందగరాని ముంగురులన్ సిరి
కొదమతుమ్మెదలందు పదిలపరచి
మధురాధరోష్ఠశుంభద్రక్తభావంబు
బింబఫలాన వ్యాపింపజేసి
ఎచటి కేగితో నాకెందు నెరుకపడవు
విసిగి వేసారిపోతిని వెద వెదకి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

జంతుసంతానంబు చరియించునియతిలో
నీసృష్టిధర్మంబు నెగడుచుండె
పాదపలతికాళి ఫలియించురీతిలో
నీదుసౌందర్యంబు నిండియుండె
భక్తాగ్రిగణ్యు లుపాసించుభక్తిలో
నీదయావనము సందీప్తమయ్యె
చిలుకలు గోరువంకలు గూయుకూతలో
నీరసజ్ఞత్వంబు నిండియుండె
పృథ్వి నెల్లెడ నీవె వ్యాపించియుంటి
విచ్చటచ్చట యని నిన్ను నేల వెదక
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీపదసంస్పర్శ ప్రాపింపగా తృణ
జాలంబు పూతమై క్రాలగల్గె
నీనఖంబులు దాక నానాలతావ
ఉత్తమజన్మల నొందగల్గె
నీకృపాసృష్టిచే నిఖిలాండజంబులు
జన్మాంతరంబున సౌఖ్యపడియె
నీయధరామృతపాయినులై గోప
వనితా పాపంబు బాయగల్గె
నిన్ను నమ్మినవారికి నిశ్చయముగ
పాపసంచయ మెల్లను భస్మమగును
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీపూజలే నాకు నిఖిలసంపద లౌను
నీపూజలే నాకు నిత్యపదవి
నీపాఠమే నాకు తాపోపశమనంబు
నీపాఠమే నాకు నిత్యతపము
నీధ్యానమే నాకు నధ్యాత్మపఠనంబు
నీధ్యానమే నాకు నిత్యధనము
నీప్రసంగమె నాకు నిత్యభాగ్యద మౌను
నీప్రసంగమె నాకు నిత్యనీతి
నీకు నాకును నీరీతి నెమ్మియొదవ
కోరి నినునెంచు నాకింక కొదువలేదు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీపూజసేయనిపాపులచేతులు
మొండిచేతులుగావె మోహనాంగ
నీ ధర్మములనాడనేరనిపదములు
దుష్కవిపదములు దురితదూర
నీధ్యానపాఠంబునేర్వని రసనంబు
తాళదుశ్శాఖయౌ దంతివరద
నీదుసంస్మరణ సన్నియతినేర్వనిజన్మ
కఠినపాషాణంబు కంజనేత్ర
మహిని నినుగొల్వనేరని మానవుండు
మానవుడుగాడు కేవలవానరుండు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నారాయణా నీదు నామమంత్రముచేత
కాలవే దుర్దోషకాననములు
దేవదేవా నీదు దివ్యకీర్తనచేత
దురితరోగంబులు తూలిపోవె
శ్రీరమాధవ నీదు సేవామృతముచేత
దుఃఖజాలంబులు తొలగిపోవె
గోవింద నీ భవ్యగుణకీర్తనముచేత
భూతసంతానంబు పొగిలిపోదె
రామనామాక్షరామృతరసము గ్రోల
కష్టసంచయ మెంతయు కలగిపోదె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పావనంబగు నీదు పదపద్మయుగళంబు
జూచుట యెన్నడో సుందరాంగ
కనకాంబరముదాల్చి క్రాలు నీమూర్తిని
అర్చించు టెన్నడో యమలరూప
చెవులార నీ వచఃప్రవిమలమధురిమ
వినగల్గు టెన్నడో వేదవేద్య
చంచరీకంబులమించు నీ కురులను
సవరించు టెన్నడో చారుహాస
అభయముదాల్చుభిసూచికరాంగుళముల
స్పర్శ లభియించు టెన్నడో పరమపురుష
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఘనవైజయంతి నే గానుగా నైన నీ
అక్కునదనరు భాగ్యంబుగలుగు
కనకాంబరముస్నైన గానుగా నైన నీ
కటినాశ్రయించు భాగ్యంబుగలుగు
కౌస్తుభమణినైన గానుగా నైన నీ
గళసీమ వే్రలు భాగ్యంబుగలుగు
కమ్రింపుసంకేని గానుగా నైన నీ
యధరపీయూష భాగ్యంబుగలుగు
బర్హిపింఛంబుగానైన వరలనైతి
వరలుచో మౌళిభూషనై మురియుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నను బాసి నీవెందుచనితి కృష్ణా యంచు
పడతియొక్కతె చేయిబట్టి యడుగ
ఇన్నాళ్లు పోయి నీవెందుదాగితో యంచు
చెలియయొక్కతె ముందునిలిచి యడుగ
మగువల నెవ్వరిమరిగియుంటివటంచు
తరుణియొక్కతె వెంటదగిలి యడుగ
ఏధనాంగనయింటి కేగియుంటివటంచు
ఉవిదయొక్కతె పజ్జనుండి యడుగ
తత్తదుచితపరిసంగంబు చిత్తమలర
జేసి సుఖవార్ధి దేలెడి భాసురాంగ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

చెలియలౌకన్నియన్ జేపట్టితివి గదా
భక్తపాపం బెట్లు పాయజేతో
స్తన్యపానంబిచ్చు దాన గూల్చితి గదా
భక్తపాపం బెట్లు పాయజేతో
మేనమామను బట్టి మృతుని జేసితి గదా
భక్తపాపం బెట్లు పాయజేతో
ఆడదానిని బట్టి యవని మట్టితి గదా
భక్తపాపం బెట్లు పాయజేతో
ఔనులే యెన్ని చందాలకైన గాని
తగియెయుందువు నిన్నెట్లు పొగడవచ్చు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీరాడు నెలతల చీరలు హరియించి
ధూర్తాకృతివైన దొంగ వీవు
బంధువు బంధించి పంచత్వమొందించి
బాంధవద్రోహినా పరగి తీవు
సత్యభామాచారుచరణతాడనమంది
మ్రొక్కిన యువతిలోలుడవు నీవు
గోపుల నెలయించి గోక్షీరముల ద్రావి
బలసిన బాల్యచాపలుడ వీవు
ఈ వొనర్చినదంతయు నింతెయైన
నిన్నా దైవమున్ గొల్వనేర నయ్యా
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పేదపాఱుండిచ్చు పేలాలు మెసవితి
గతినీకులేదె రక్కసులగొంగ
విదురుగేహంబున విందారగించితి
జాతినీతులులేవె జలజనయన
చక్రమూనక చేతు సారథ్య మనిచెప్పి
తప్పి పట్టగలేదె ధర్మరూప
పొగరుగిబ్బలబట్టి పొంకంబడంచితి
ప్రాణిప్రియతలేదె పద్మనాభ
ఔనులే భక్తసంరక్షణాభిరతిని
నెగడితివి నీకు చేయరానిదియు గలదె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పేదబాపనుడిచ్చు పేలాలు దిను నిన్ను
ధరణీశుడంట మాతప్పు గాదె
కడగి సూతునియింటకుడిచిన నీమూర్తి
పరిపూతమనుట దబ్బఱయ గాదె
శబరియెంగిలిపండ్లచవులజూచిన నిన్ను
పురుషోత్తముడన దుర్బోధ గాదె
వల్లవీమానంబు కొల్లగొట్టిన నిన్ను
సంయమివంట దోషంబు గాదె
ఎంతజూచిన దోసంబు లెసగె నైన
నిను నిరాకృతిగాగ ధ్యానించుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ముఖచుంబనక్రియా మోహంబు వెలయించి
అలనాగ్నజితి ప్రేమ నాచికొనగ
పాదనా కసంవాహనాలోలత
నెఱయుంగ భద్ర బంధించికొనగ
గాఢపరిష్వంగకలన సుఖశ్రీద
యై మిత్రవింద మే నదిమికొనగ
బింబాధరస్యందిపీయూషపానప్ర
మత్తయై కా ంది గుత్తకొనగ
సుఖవిలాలసుడైన నీచూడ్కులకును
దీనురాలిని నే నెట్లుగాననగుదు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

సాత్రాజితీచారునేత్రాంచలాలోల
దృక్ శాతబాణబంధితుడ వగుచు
రుక్మిణీమృదుతనూరుక్మప్రభాచ్ఛటా
కర్షితనిజమనఃకంజు డగుచు
జాంబవతీహస్తజలజప్రసాధిత
విజితా కుంతలవ్రజుడ వగుచు
లక్షణాకరమూర్తి లక్షణాకరపరి
ష్కృతకటిసౌవర్ణచేలు డగుచు
మరగిపోయిన నీవు నామాట వినుదె
వెర్రినై నిన్ను నిట్లు భావింతుగాని
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పొట్టనిండకపోయెబో నీకు వ్రేపల్లె
లీల వెన్నల దొంగిలింపకున్న
ప్రొద్దుపోకడలేదుపో నీకు వ్రేపల్లె
గడగి గోవులనెల్ల గాయకున్న
కట్టబట్టలులేనిగతినొందియుందుబో
వ్రేతచీరల దొంగిలింపకున్న
ఊరుపేరునులేకయుందుబో తొలినాడు
మేనమామను మిత్తిమెసవకున్న
అబలనై నిన్ను బ్రోవుమం చడుగుచుండ
నీటుగందు వేరెరుగని నీటుగలదు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కులగోత్రములదాచి గుణజాలములబాసి
పరగంగ శ్రీకృష్ణ భావ్యమటర
వావి వరుస బంధువర్గంబు లేకయ
వర్తింప శ్రీకృష్ణ భావ్యమటర
తల్లిదండ్రులపేర్ల తారుమారొనరింప
పద్మనాభా నీకు భావ్యమటర
పతియెద్దైవమటంచుభావించు సతులమా
నముదీయ పరమాత్మ న్యాయమటర
ఇట్టినడతలు నీకుగా కెందునైన
లోకులకు గల్గునే ఓయి లోకనాథ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

తల్లిదండ్రులబాసి తా పరులిండ్లలో
ఉండువానికి ప్రేమ యుండునో కొ
మేనమామనుబట్టి మృతుజేయుఘనునకు
భక్తులపై ప్రేమ పరగునో కొ
జారత్వచోరత్వచతురుడౌ పురుషుండు
శిష్టరక్షణ మెట్లు చేయునో కొ
ఉచ్ఛిష్టమునుగూడ నుడుగక తిను నరు
డితరులకై యేమి యిచ్చునో కొ
ఇట్టిలక్షణవంతు ని న్నెరుగలేక
కొలుచుచుంటిని నిరత మకలుషమతిని
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నారదముని యెట్టినాణెంబుల నొసంగె
ద్రౌపదీసతి యెంతధనము నిచ్చె
ప్రహ్లాదు డెట్టిసంపజ్జాలము లొసంగె
ద్విరదాగ్రిగణ్యు డేకరము నిచ్చె
అంజనాసుతు డెంతయాదరంబును జూపె
గౌతమసతి యెంతగారవించె
సనకాదిమౌను లేసాయంబు సేసిరి
ధ్రువసత్తముం డెంతయవని యిచ్చె
ఈవియే నీకు వలసిన దేని దేవ
ఈయగా నేర్తు వారల కెక్కుడుగను
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భ గుణశీల వేణుగోపాలబాల.

పుండరీకాక్ష నీ యండగోరుచునుంటి
మారుబల్క విదెంతగారవంబు
శ్రీరామచంద్ర నీ చెంతజేరినదాన
వరము లిచ్చుటగూడ భరమె నీకు
గోపాలకృష్ణ నిన్ గోరియుంటిగదోయి
కోరిక లొనగూర్ప భారమానె
కేశవా సతతంబు ర్తించుచుంటిని
కరుణజూడ విదేమికటికితనము
దాసపోషకయని నిన్ను దలచితలచి
విసిగిపోతిని దయరాదు వేంకటేశ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

వడుగుబాపడవయ్యు బలిచక్రవర్తిని
తిరిపెమెత్తగలేదె దేహియంచు
శబరియెంగిలిపండ్లు చక్కగా నందీయ
తిండిపోతన నీవు తినగలేదె
సూతునింటనుజేరి జాతిభేదమువీడి
తెంపుమై విం దారగింపలేదె
పేదకుచేలుండు పేలాలుగొనిరాగ
మిక్కుటంబుగ బట్టి మెక్కలేదె
ఇట్టి సూక్ష్ముని నిన్ను దేవేశుడనుచు
మొక్కితిని మొక్కుచుంటిని మొక్కగలను
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

రావణాసురుగూల్చి రమణిదెచ్చితివన్న
నాతికై పోరాడ నీతియగునె
తాటకిఖండించి తపముగాచితివన్న
తరుణినిఖండింప ధర్మమగునె
రావణిజంపి తద్రమణి వేడితివన్న
బ్రతుకుకై సతివేడ పాడియగునె
అగ్రజువధియించి యతనితమ్ముని రాజ్య
మేలించుటలు నీకు శీలమగునె
ఇవి యధర్మంబులనిజెప్ప నేరితరము
తిమ్మబమ్మని బమ్మనితిమ్మజేతు
శ్రీయుతాకార పల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

చిత్తజుబారి గాసిల్లి వేడుచు రాగ
రక్కసిముక్కును చెక్కుటేమి
వనితాశిరోమణి జనకాత్మజనుదెచ్చి
అనలకుండంబున నునుచుటేమి
చెట్టుచాటునదాగి చేరి కోతినిజంపి
తార నేడ్పింప నీ ధర్మమేమి
మైరావణునిజంపి మఱి వానియర్ధాంగి
నొప్పించుటందు నీ గొప్పయేమి
గొప్పవారెట్లుజేసిన తప్పుగాదు
ఐంద జాలికు వు నిన్ననగనేల
్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

కా వ్యా

అజ్ఞానకాంతార మంతంబు గావించి
జ్ఞానాంకురంబుల చల్లరాదె
మదమోహములను నాయెదనుండి పెడజేసి
నీనామసుధవెల్లి నింపరాదె
దోషరోషాశాదిదురితంబులను బాపి
నీనామసుధవెల్లి నింపరాదె
కామలోభాదుల కడనొత్తి నామదిన్
నీనామసుధవెల్లి నింపరాదె
నీవు నీవని సర్వంబు నీవెయనుచు
నిను నుపాసించు నను కనుంగొన వదేమి
శ్రీయుతాకార వల్లపీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శత్రువర్గము గెల్చి జయమునందినగాని
రామమంత్రామృతరసము రాదు
దుష్టజాలము గెల్చి శిష్టుడైననుగాని
రామమంత్రామృతరసము రాదు
ఈషణత్రితయంబు నేపడంచినగాని
రామమంత్రామృతరసము రాదు
సంసారవర్గంబు సడలించిననుగాని
రామమంత్రామృతరసము రాదు
సర్వ మెరిగియు విడక నీచరణములను
బత్తి నమ్మితి నన్నెట్లు భద్రపరుతొ
శ్రీయుతాకార వల్లపీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నాశరీరంబంచు నీశరీరంబంచు
నాది నీదని యెన్ను నరులు నరులె
నామందిరంబంచు నీమందిరంబంచు
నాది నీదని యెన్ను నరులు నరులె
నాతటాకంబంచు నీతటాకంబంచు
నాది నీదని యెన్ను నరులు నరులె
నాధేనుతతియంచు నీధేనుతతియంచు
నాది నీదని యెన్ను నరులు నరులె
బహువిధములై నదృశ్యరూపముల నరసి
పరమమాయగ గనువారు నరులుగాక
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

అపకారికేనియు నుపకార మొనరించి
పరమార్థమెరిగినసరసవరులు
ధర్మమే జీవిసాధ్యంబంచు దలపోసి
దినములం బుచ్చెడి ధీరవరులు
పరకాంతలను మాతృభావంబునన్ జూచి
భువి సంచరించెడిపుణ్యమతులు
సంతతహరినామసంస్మరణామృతం
బును గ్రోలి తృప్తులౌ మనుజవరులు
ధర్మపత్నిని లక్ష్మిగా దలచునరులు
మాత్రమే నీకు ప్రియులంట మంత్రసాధ్య
యుతాకార వల్లవీచిత్తచోర
వ్యగుణ ల వేణుగోపాలబాల.

పతియె దైవంబుగా భావించి మదిలోన
కాలంబు బుచ్చెడికలికిమిన్న
అతిథి నభ్యాగతి నాదరంబున గాంచి
సత్కార మొనరించుచానమిన్న
పరమపాతివ్రత్యభవ్యశీలల బూజ
నము సేయునట్టిదా నాతిమిన్న
పరుషవాక్యంబుల బలుకక సతతంబు
సుగుణంపుప్రోవైన మగువమిన్న
నీదుసాన్నిధ్యమందున నిల్చునట్టి
భాగ్య మార్జించుకొందురు పరలకౌనె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

మందారముల దెచ్చి మాలలగా గూరి
వింతగా నీమెడ వేతు కృష్ణ
పున్నాగముల దెచ్చి సన్నయల్లిక లల్లి
నీకిరీటంబున నింతు కృష్ణ
బొండుమల్లెల దెచ్చి దండలగా గ్రుచ్చి
సిగజుట్టి నిన్ను గైసేతు కృష్ణ
సంపెంగలను దెచ్చి సొంపైనకౌస్తుభ
మణికిగ్రింద చాల్జేసి కనుదు కృష్ణ
ఇవ్వియేకాదు పుష్పము లెన్నియేని
తెచ్చి నీ కర్పణముజేతు దేవదేవ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

సీత నిన్నే రీతి సేవించియున్నదో
శ్రీరామచంద్ర శృంగారధామ
లక్ష్మి నిన్నే రీతి లాలించి యున్నదో
జిష్ణు రోచిష్ణు సహిష్ణు విష్ణు
సత్య నిన్నే రీతి సరసాల దేల్చెనో
మునిలోల గుణజాల కనకచేల
భీష్మజ నిన్నెట్లు ప్రేమించి యున్నదో
భక్తాగ్రగణ్యాసంసక్తిలోల
ఏ తెరంగుల వారు నిన్నేలుకొనిరో
తెరగులన్నిటి మించిన దొరవు నీవు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఎందువర్తింతువో యెరుగరావు గదోయి
పావనాకార దశావతార
ఎందునిల్చెదవొకో యెరుగరావు గదోయి
సౌందర్యజితనైకశతమనోజ
ఎందెందునుందువో యెరుగరావు గదోయి
కరుణాకటాక్షవీక్షణమనోజ్ఞ
ఎందేగుచుందువో యెరుగరావు గదోయి
వీరదానవపరిహారకార
పలు తెరగుల నిను తెలియవలయు ననిన
తెలిసికొనలేకయుంటిని దేవదేవ
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

సొగసైననీమోము జూచినంతనె చాలు
అఖిలసౌభాగ్యంబు నందినట్లు
అమలము నీపూజ యాచరించిన చాలు
పరమేంద్రభోగంబు దొరకినట్లు
చెలగి నిన్నొకసారి చింతజేసిన చాలు
ఘనమైభవస్ఫూర్తి గలిగినట్లు
కనుల నిన్నొకసారి గాంచినంతనె చాలు
అతులబ్రహ్మానంద మమరినట్లు
గాగ భావించుచుందు నో కమలనేత్ర
పాల ముంతో మరెందో నీపాల బడితి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పండుటాకుల రాల్చిపల్లవించిన తీవ
కొన లల్లుపొదరింట కసవు జిమ్మి
పునుగుజవ్వాజినా పొలుపువస్తుల నీట
ముంపెత్తికొని కలయంపి జల్లి
ఘనసారతరువుల తను దాన రాలు క
ర్పూరంబుపొడి జల్లుముగ్గు వెట్టి
ప్రత్యగ్రదర్భాంకురముల మెత్తనిదైన
నునుపైన తళుకుకుటాసనము వైచి
వింతపూవులఫలములదొంతు లేర్చి
శబరి యాతిథ్యమిడ గొనుస్వామి వీవు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శ్రీసీత యంకంబు జేరి యధివసింప
చామరంబులను లక్ష్మణుడు వీవ
శతృఘ్నుడు ధవళచ్ఛత్రింబు ధరియింప
పాఱు లాశీర్వచస్స్వస్తి జెప్ప
రాజరా జగు నేడు రామచంద్రుం డని
జాంబవంతుడు భేరి చాటుచుండ
భరతుండు విడెముల భక్తి సభ్యుల యా
వాయుపుత్రుడు సేవ జేయుచుండ
శ్రీసమాలోక్యపట్టాభిషేకపీఠ
మధివసించిన నీవు న న్నరయుమయ్య
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శ్రీరామచంద్రమూర్తివిగాగ జన్మించి
తల్లి కోసలజాత దనుపలేదె
దివ్యగోపాలాకృతిం భూమి జనియించి
పరగి దేవకి మోదపరుపలేదె
వటపత్రశాయివై పృథ్వస్తలోకాళి
సృష్టింప బ్రహ్మ సృజింపలేదె
వామనాకృతి బూని వసుధ దానముగోరి
చెలగి కశ్యపు పుణ్యు జేయలేదె
నిన్ను గనినట్టి వారును నీవు గన్న
యట్టివారలు పూజ్యు లోయబ్జనాభ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఆ విభీషణకిరీటాంచలమణులందు
ప్రతిబింబితంబయి పరగె నెద్ది
సీతామహాదేవి చెక్కుటద్దములందు
ప్రతిబింబితంబయి పరగె నెద్ది
పాతాళముంజేర బలిని ద్రొక్కినవేళ
బ్రహ్మాండమును నిండి ప్రబలె నెద్ది
రణరంగమున సురరాజసూనునకునై
విశ్వరూపంబు జూపించె నెద్ది
అట్టినీచిత్స్వరూపంబు గట్టి కనుల
మదిని మననముజేసెద మరువకుండ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శ్రీరమాప్రాణనాథు జితదైత్యగణనాథు
కామితార్థప్రదు కమలపాదు
నిత్యసిద్ధానందు నిఖిలలోకసువంద్యు
సుజనభక్తవిపోషు సుకృతవేషు
నారదమునిలోలు నందగోధుగ్బాలు
లోకసన్నుతకృత్యు లుప్తమృత్యు
వేదవిద్యాధారు విశ్వపూర్ణాకారు
పావనాకారు దశావతారు
అమలసీతామనోవాసు నఘవినాశు
నిను నెడందను విడక ధ్యానించుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఏశక్తి గల్గెనో యిల రావణాసురు
బట్టి జంపినయట్టి జెట్టితనము
ఏశక్తి గల్గెనో యిల జామదగ్న్యుని
భంగపెట్టిన హస్తపాటవంబు
ఏశక్తి గల్గెనో యిల వాలి నొకకోల
గూలనేసినయట్టి గొప్పతనము
ఏశక్తి గల్గెనో యిలలోన తాటకి
దోర్లీల జంపిన దొరతనంబు
వాని నన్నింటికిని మూలమైన నీదు
పటుతరాత్మబలంబు నే బ్రస్తుతింతు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

గజరాజు మొర విని కావ వేంచేసితి
తన్నుతిన్ గలగొప్పతనము తెలిసి
అలనాడు పాంచాలివలువల నిచ్చితి
తన్నుతిన్ గలగొప్పతనము తెలిసి
అమరాంగనల గావ నవతార మొందితి
తన్నుతిన్ గలగొప్పతనము తెలిసి
ప్రహ్లాదు రక్షింప వరనరహరి వైతి
తన్నుతిన్ గలగొప్పతనము తెలిసి
మన్నుతిన్ నిల్పి ప్రార్థింతు మానవేశ
నన్ను బ్రోవగ నీవేల వెన్నుజూతు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

షడ్రుచిబహుళభక్ష్యంబు లాశింతువా
కోరునన్నిటి నొనగూర్చుదాన
జాతరూపాంబరజాల మాశింతువా
వేవేలు దెచ్చి కప్పించుదాన
వన్నెవన్నెలయాటవస్తు లాశింతువా
బండ్లమీదను దెచ్చి పంపుదాన
బంగారుసొమ్ములపటల మాశింతువా
ఎంచలేనన్ని చేయించుదాన
వేనిగోరిన నీచిత్త మోనగధర
ఎద దొణకుబత్తితోడ నీకిచ్చుదాన
శ్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

అమలినచందన మభిలషించెద వేని
పొలుపుగా నీమేన బూయుదాన
పలువిధంబులసూనముల గోరుకొందు వే
జెలగి నీమేన గై సేయుదాన
మంచికస్తూరి కాంక్షించెదవందు వే
దిలకంబుగా మోము దిద్దుదాన
పొలుపైనజవ్వాజిపునుగు కోరెద వేని
తళుకొత్తునీ దేహ మలదుదాన
అదియిదియటుంచు నేను వే యనగనేల
ఏదిగోరినగాని నీ కిచ్చుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

మకరంబు గజరాజు మర్దించుచుండంగ
అరిజంప నరిబంపి యరయలేదె
పాంచాలి సభలోన వంచింపబడి వేడ
వలువలనిచ్చి కాపాడలేదె
అపరాధినయ్యా నా నెపమెన్నకయ ప్రోవు
మన్న కాకాసురు నరయలేదె
ప్రహ్లాదు డతిభక్తి ప్రస్తుతింపగ మెచ్చి
కనకకశిపు బట్టి తునుమలేదె
వారి ని నీకు నెట్టిసంబంధ ముండె
నాదుప్రార్థన నీచెవి నాటదేమి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శాంతత్వమునుజూపు సత్వగుణముజూపు
నీలమేఘచ్ఛాయ బోలువాడు
కారుణ్యమునుజూపు గాంభీర్యమునుజూపు
కల్పతరువుభంగి గ్రాలువాడు
ఐక్యభావముజూపు ఆశ్రితులకు కాపు
ఆజానుబాహువు లలరువాడు
దుష్టులదండించు శిష్టులపాలించు
ధవళాబ్జపత్రనేత్రములవాడు
మహిమగలవాడు లక్ష్మీసమంచితుండు
కానరాడయ్యె నెచ్చట గలడొ గాని
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.


కా కా

చిన్నారికూర్మి నీ చిద్విలాసమెగదా
సీతమ్మ వలలోన చిక్కువడియె
చారునీలాంబుదశ్యామలత్వమెగదా
తపసులమనములన్ దగులుకొనియె
అకలంకమైన నీ ప్రకటాకృతియెగదా
మును లెడందలగాంచి మోదపడిరి
బహుకోటిమదనశుంభద్రూపమేగదా
గోపికావితతిచే కోరబడియె
పరమపావనత్వద్రూపవైభవంబు
నేడు దక్కించుకొందు నా నేర్పుగనుము
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ధవళాబ్జపత్రనేత్రములు గల్గినవాని
బొడ్డుతామరతోడ పొల్చువాని
కోదమతుమ్మెదనేలుకురులు గల్గినవాని
జలధరుబోలు మైచాయవాని
కమనీయమైనట్టికంఠంబు గలవాని
రాజితపీతాంబరంబువాని
చక్రగదాశంఖజలజముల్ గలవాని
కౌస్తుభమణిమంజుకాంతివాని
నిన్ను గా నమ్మితిన్ నవనీతచోర
వరములనొసంగి నన్ను కాపాడుమయ్య
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

రా గోపికాలోల రా భక్తమందార
రా యశోదాత్మజ రార కృష్ణ
రా రుక్మిణీలోల రా శ్రితపోషక
రా బాలగోపాల రార కృష్ణ
రా రాధికానాథ రా నృగునృపపాల
రా దేవ పుత్రి రార కృష్ణ
రా సత్యావా ల రా కుచేలావన
రా రా జనార్దన రార కృష్ణ
అనచు పలువిధముల బిల్చుదునుగదోయి
వచ్చి నాతోడ మాటాడ వలనుపడదె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

రాగదే గోపాల రాజీవదళనేత్ర
రమ్ము శ్రీపర విష్ణు రమ్ము కృష్ణ
రాగదే దధిచోర రాజితకౌస్తుభ
రమ్ము మధుధ్వంసి రమ్ము కృష్ణ
రాగదే వ్రజబాల రాజేంద్రపరిపాల
రమ్ము త్రివిక్రమ రమ్ము కృష్ణ
రాగదే యోగాత్మ రజతాద్రిచరమిత్ర
రమ్ము శ్రీవామన రమ్ము కృష్ణ
నిన్నుబిలిచితి శ్రీధరా నన్ను నేల
ఇష్టఫలసిద్ధిగావింప నీవగావె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.



కా వా

దయసేయగదవయ్యా దైత్యేంద్ర సంహార
దయసేయగదవయ్యా ధర్మరూప
దయసేయగదవయ్యా ద తామరవిపాద
దయసేయగదవయ్యా దంతివరద
దయసేయగదవయ్యా దశరథసత్పుత్ర
దయసేయగదవయ్యా తత్త్వరూప
దయసేయగదవయ్యా ధవళాబ్జలోచన
దయసేయగదవయ్యా దానవారి
వేగ దయసేయుమయ్యా యో విశ్వరూప
వేదవేదాంతసంచార విబుధవినుత
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పదిసార్లు నీకథల్ చదువనేర్చిననాకు
ఇతరపాఠములపై నిచ్చపోదు
కవనంబు నీపైన కట్టనేర్చిననాకు
వర్ణ్యేతరంబు లభ్యంబుగాదు
ఇహాపవిశ్రమము నీదు మహిమగ్రోలిననాకు
విషయేతరంబులు వేడ్కగావు
భక్తిని నిన్నెప్డు ప్రస్తుతించెడినాకు
అన్యుల ర్తింప నలవిగాదు
నిన్నునమ్మిన నా కెప్డు నిక్కముగను
ఇతరదైవంబులంగొల్వ నేవ మగును
యుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

మాకంద ఫలరసమాధుర్యమునకన్న
రామనామామృతరసము తీపి
రంభాఫలాంతరరసమధురిమకన్న
రామనామామృతరసము తీపి
నారికేళఫలస్థనీరమాధురికన్న
రామనామామృతరసము తీపి
ద్రాక్షాఫలాంతస్థరసమాధురులకన్న
రామనామామృతరసము తీపి
అనుచు నీనామరసమందు నమలినరుచి
మునులు వల్కగ నమ్మి నే ననుభవింతు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

మధుసూదనా పిల్వ మారుబల్క విదేమి
మునిజనార్చితపాద మొ్రక్కుదాన
వామనా యనివేడ వరము నియ్య విదేమి
శ్రీనాథ యంజలి సేయుదాన
దామోదరా పిల్వ దయనుజూడ విదేమి
శ్రీధరా నిన్ను పూజించుదాన
కమలనాభా పిల్వ కరుణనింప విదేమి
జలజాక్ష జోహారు సల్పుదాన
పలువిధంబుల నుతిజేతు పార్థివేంద్ర
నందగోపకనందన యిందిరేశ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.



కా. వా.

దండంబు నీ కిదే దానవాంతక వేష
కేశవా బహుపాపకృంతనచణా
జోహారిదే నీకు శుద్ధసిద్ధారాధ్య
నారాయణా బహునామరూప
వందనం బిదె నీకు నిందిరాహృదయేశ
మాధవా ద్రౌపదీమానరక్ష
అంజలి నీ కిదే యంభోజినీనాభ
గోవింద నందాఖ్యగోపబాల
వందనసహస్రముల జేతు పద్మనాభ
నను నరసి ప్రోవగా రాదె నాగశయన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శ్రీవాసుదేవ యాశ్రితజనపరిపాల
ప్రద్యుమ్న సకలాఘపటలదూర
అనిరుద్ధ దేవేశ మునిజనపరిపాల
పురుషోత్తమా సుధాంబుధివిహార
శ్రీహృషీకేశ భాసితపుండరీకాక్ష
నరసింహ బహుకోటినామవినుత
దామోదరా చతుర్దశభువనవినేత
జనార్దన యాదిశేషశయన
ఓయి యచ్యుత సంకర్షణా యతీంద్ర
అనుచు నీనామసంస్మృతి నాచరింతు
యుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నీపాదపద్మంబు నెరి శిరంబున దాల్చు
బలియెంత యుద్వృత్తభాగ్యయుతుడో
నీపాదధూ చే నెమ్మేను బూనిన
గౌతమాంగన యెంత పూతమతియొ
నీరూపమును గాంచి నిజరూపమును దాల్చు
నృగు డెంత పుణ్య మార్జించినాడో
నీయడ్గుదమ్ముల నిగ్గునదీపించు
కా యు డెంతటి ఘనయశుండో
పరమపావనమైన నీపదములంటు
కలిమి నార్జింప నిన్నిట్లు దలచుచుంటి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

వెదకి వేదంబుల విధికి నందిచ్చిన
మత్స్యావతారంబు మరచినావో
కుంగిపోబోయిన కుధరంబు నెత్తగా
పరగి కూర్మంబౌట మరచినావో
ఇల చాపజుట్టగా నెత్తి రక్షించిన
వరవరాహాకృతి మరచినావో
హరిపరమాత్మ విద్యావ్యాప్తికొరకైన
నరసింహ రూపంబు మరచినావో
బలిని పాతాళమును జేర బంచినట్టి
పరమవామనరూపంబు మరచినావో
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

భార్గవాకృతిని భూవరవర్గముం గొట్టి
వీరతన్ వెలసినవీరు డీవె
దశరథాత్మజుడవై తండ్రి మొదల బూని
ధర్మంబు తెలిపినధన్యు డీవె
బలరామమూర్తివై బలుని ద్వివిదు జంపి
ప్రఖ్యాతిగొనినట్టిప్రబలు డీవె
బుద్ధాకృతింబూని సిద్ధాంతముల నిల్పి
ర్తినిగొనినట్టిమూర్తి వీవె
కల్కిరూపంబుదాల్చి సంకరులదు్రింప
ప్రతినబూనిన రాజాధిరాజు వీవె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

దశరథరాఘవా దయజూడ వేమిరా
దశవిధవేష సద్ధర్మపోష
వసుదేవనందనా వాంఛదీర్ప వదేర
వల్లవవేష శ్రీభావపోష
కశ్యపసుకుమార కఠినత మానరా
సిద్ధస్వరూప శ్రీబుద్ధరూప
జమదగ్నిపుత్రకా భ్రమదీర్ప వేమిరా
బ్రాహ్మణవేష కర్మప్రపోష
కోమలాకార పరమవైకుంఠవాస
మన్మనోవాంఛ దృ్పమా మాహృదీశ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

భీష్మపుత్రికసామ్ము ప్రియమైన నీమోము
కనుటకు యోగులు గాచియుంద్రు
సత్యభామధనమ్ము సదయమౌహృదయమ్ము
విబుధులు కన్గొన వేచియుంద్రు
జాంబవతిఫలంబు జ్ఞానైనమధ్యమ్ము
భక్తులు జూడగా పరగుచుంద్రు
కాందిసొమ్ము నీ కమనీయపాదమ్ము
వేడ్కతో సిద్ధులు వెదకుచుంద్రు
వారలెల్ల రారీతిని కోరుచుండ
వేడ్కతో నేను కోరుట వింతకాదు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణాల వేణుగోపాలబాల.

నాగ్నజితీ దేవినాణెముల్ నీకురుల్
సవరింప వ్రేతలు సంభ్రమింతుర్
లక్షణభాగ్యమ్ము లలిగందపుంబూత
పూయగా మునులెల్ల పొంగుచుందుర్
మిత్రవిందా దేవి మిత్రంబు నీసేల
దేవతాసంఘంబు దివియగోరు
భద్రభాగ్యంబు నీ పాటలాధరమును
గోప్‌ల నెల్లరు మది గోరుచుంద్రు
నీకు దాసానుదాసిని నీదురూపు
చూడగోరుటలో పెద్దచోద్య మేమి
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

జలధరచయము నీ జాడదెల్పునటన్న
పడిపోయినట్లుగా పరువులెత్తు
మలయానిలుండు నీమాటదెల్పునటన్న
విరికన్నియలగూడి మురియుచుండు
గంగానదీతరంగములు దెల్పునటన్న
ఘోషించుగాని నా ఘోష వినవు
అలవసంతుండైన తెలుపునీపథమన్న
మదనుని జేరి నామాటవినడు
ఎవరు నీజాడదెల్పుదు రింకనాకు
ఎందువెదకుదు నీపదంబెట్లు దొరకు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఘోరకాంతారముల్ కుమ్మరిల్లితి గాని
కనరావు నీ వెందుగలవో కృష్ణ
క్రూరజంతునివాసగుహాల గాంచితి గాని
కనరావు నీ వెందుగలవో కృష్ణ
అంతులేనియెడారు లంటి జూచితి గాని
కనరావు నీ వెందుగలవో కృష్ణ
అబ్ధుల నదులెల్ల నరసి వచ్చితిగాని
కనరావు నీ వెందుగలవో కృష్ణ
నిన్ను మాయానరాకృతి కన్నులార
జూచుటకు కష్టమెంచను సుఖముపడను
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

సొగసైననేత్రావిసూనంబులను జూచి
నీమూర్తి లోన ధ్యానించుచుందు
బర్హిబర్హంబు సౌభాగ్యంబు వీక్షించి
నీమూర్తి లోన ధ్యానించుచుందు
శంపాసమంచిత జలదంబు వీక్షించి
నీమూర్తి లోన ధ్యానించుచుందు
తరుణారుణాబ్జపత్రిముల విలోకించి
నీమూర్తి లోన ధ్యానించుచుందు
అవుర నీమూర్తిలోనిమాహాత్మ్య మేమొ
ప్రకృతిసౌందర్య మందున వ్యాప్తమయ్యె
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కౌస్తుభమణికాంతి కమనీయమైన నీ
నిర్మలాకారంబు నిత్యమనుచు
నీరవాహోద్దీప్తనీలత్వహితము నీ
నిర్మలాకారంబు నిత్యమనుచు
భక్తజాలాత్యంతభావితంబైన నీ
నిర్మలాకారంబు నిత్యమనుచు
లక్ష్మీ నిలయమంగళంబైనయట్టి నీ
నిర్మలాకారంబు నిత్యమనుచు
నిత్యతన్ కేవలంబుగ నీకెకూర్చి
నిన్ను శాశ్వతుగాగ ధ్యానించుచుందు
ప్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.



కావ్యా

పుట్టింప రక్షింప గిట్టింప గానైన
సర్వేశ్వరుండ వీ సకలమునకు
దుష్టుల ... ంప శిష్టుల రక్షింప
ప్రభుమూర్తి వీవు ప్రపంచమునకు
ధర్మంబు నిల్పి యధర్మంబు పోదోల
ధర్మమూర్తివి లోకతతికి నీవు
భుక్తిని గల్పింప శక్తిని గల్పింప
అంబాకృతివి నిఖిలంబునకును
రాజ్యమేలుచునుండెడి రాజు వీవు
నిన్ను నేనెట్లు వర్ణింప నేర్తునయ్య
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

దశరథాత్మజుడైన దాతను జూపరే
సతము గ్రుమ్మరుసూర్యచంద్రులార
జనకునియల్లుడౌ మునిలోలు జూపరే
వనవాసులౌ మానివర్యులార
కౌసల్యముద్దులగని సుతు జూపరే
పుణ్యకార్యాసక్తి గణ్యులార
సీతాకళత్రుడౌ ్రరాము జూపరే
ధర శాసకులైన తంద్రులార
అనుచు నెల్లర నీకొర కార్శయింతు
వెర్రినై యొక్కరును మొరవినరు దేవ
.్రియుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ప్రోవవా దయతోడ గావవా నన్నిందు
నీవెగా దిక్కంటి నీరజాక్ష
వాదోకో నాపైన లేదోకో యనుకంప
రావోకో నను బ్రోవ రామచంద్ర
మానవా కఠినత పూనవా నాచేయి
కానవా నన్నోయి కమలనేత్ర
న్యాయమా యిది సాంప్రదాయమా రాకుంట
భావ్యమా నీకు నోపద్మనాభ
మర్మమా లేకమాదగుకర్మమా సు
ధర్మమా నన్ను బ్రోవగా తలచవయ్యా
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

గోపికాజనలోలు గోపాలు జూపరే
పాయకుండెడి యష్టభార్యలార
నందునిముద్దులనందను జూపరే
అనయంబుగొల్చెడి జనములార
దేవకిగారాముప్రోవును జూపరే
తనయునిదయజూపు తల్లులార
శ్రీరుక్మిణీశ ప్రియు నిట జూపరే
పదియారువేల ప్రేపడతులార
ఎచటనున్నాడో శ్రీకృష్ణు డెట్లుదొరకు
తెల్పుడీ యని నీకయి దేవురింతు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఆవాహనము నీకు నైశ్వర్యవిజితేంద్ర
ఆసనం బిదె నీకు నమలరూప
అర్ఘ్యంబు నీకు సర్వాధారచిద్రూప
పాద్యంబు నీకు నో భక్తపాల
ఆచమనము నీకు నవతారపూరుష
శుద్ధోదకస్నాన మిద్ధచరిత
వస్త్రంబు సిద్ధగీర్వాణాదినన్నుత
యజ్ఞోపవీత మో యంబుజాక్ష
గంధమిదె నీకు దేవ బంధముక్త
అక్షతలు నీకు దేవేశ పక్షివాహ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పద్మనాభుడవంచు పాదయుగ్మంబును
సద్భక్తితో పూజసలుపుదాన
కమలాక్షుడవని నీ కోమరుగుల్భములను
అలఘుభక్తిని పూజసలుపుదాన
శ్రీనాథుడవని నీ చెలువగునూరువుల్
కలితభక్తిని పూజసలుపుదాన
కా యమర్దనఘనుడవంచును కటి
తలముబత్తిని పూజసలుపుదాన
ఈశుడవటంచు విరిదండ లిచ్చుదాన
సిరికిపతివని నాభి పూజించుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

విజయుండవని నీదు భుజపూజనము సేతు
హస్తంబు లర్చింతు నమలరూప
కమలేశు డవని నీ కంఠంబు పూజింతు
మోము నర్చింతును ముగ్ధరూప
నరసింహుడవని నీ నాసిక పూజింతు
అక్షుల నర్చింతు నఖిలరూప
పరమాత్మవని నీదుఫాలంబు పూజింతు
శిరము నర్చింతును చిత్స్వరూప
అగణితంబైన నీదుసర్వాంగములకు
పూజచేసెద పుష్పముల్ ప్రోవు సేసి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణాల వేణుగోపాలబాల.

ధూపంబు నీకిదే తోయజాయతనేత్ర
దీపంబు శ్రీదేవదేవ నీకు
నానావిధాహారనైవేద్య మిచ్చెద
పానీయ మిదె నీకు పద్మనాభ
పాణిపాదములను ప్రక్షాళనము జేతు
శుద్ధాచమన మిదె శుభద నీకు
తాంబూలముంగొమ్ము దైన్యాపనోదక
నీరాజనము గొను నిరఘోష
మంత్రపుష్పంబు గొనుము సన్మంత్రదీప్త
ఇదె ప్రదక్షిణవందన మిద్ధచరిత
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణాల వేణుగోపాలబాల.

ప్రవిమలగౌరవభాగ్యంబునకు గాదు
కుక్షినింపగ కూటికొరకు గాదు
ఘనమగుద్రవ్యంబు కావలెనని గాదు
కూతులకొడుకులకొరకు గాదు
ఇండ్లవాకిళ్లను నీయుమంచని గాదు
ఆయుష్యభాగ్య మిమ్మంచు గాదు
పుడమిలో సత్కీర్తి పొందుటకును గాదు
నగలనాణెములపొందగను గాదు
అక్షయంబగుమోక్షంబు నభిలషించి
నిన్ను నీరీతిగాగ ధ్యానించుచుంటి
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

సుకరమై పాపసంక్షోభమై నీసేవ
ఇంపుగల్గించు మాదంపతులకు
సులభమై చిదూపిసుఖమైన నీసేవ
సొంపుగల్గించు మాదంపతులకు
వ్యక్తమై వేదాంతసక్తమై నీసేవ
పెంపుగల్గించు మాదంపతులకు
ప్రమదమై యానందవరదమై నీసేవ
మంపుగల్గించు మాదంపతులకు
భాగ్యదంబయి స్వేచ్ఛాప్రభావ మగుచు
ఇంపునింపు నీసేవ మాదంపతులకు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

నిగనిగలాడు నీనగుమొగమ్మని వర్ణ
నము సేతుగాని యన్యమ్ము నెరుగ
నిద్దంపుచెక్కిళు లద్దంబులని వర్ణ
నము సేతుగాని యన్యమ్ము నెరుగ
మధురాధరంబు బింబఫలాభమని వర్ణ
నము సేతు గాని యన్యమ్ము నెరుగ
రదములు మల్లికాప్రసవంబులని వర్ణ
నము సేతుగాని యన్యమ్ము నెరుగ
ఇంతకాల మదెటో గతియించి పోయె
కనక వర్ణించుటలు చేతగాదు మీద
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కన్నతండ్రిగ నిన్నుగని మంచి చెడు జెప్ప
కలదు కోరికగాని కానరావు
మాత జానకి కేమో మాటల జెప్పుకో
కలదు కోరికగాని కానరాదు
సౌమిత్రిచెంత నాచరితంబు వినిపింప
కలదు కోరికగాని కానరాదు
వాయుపుత్రుని జేరి వాంఛ మనవిచేయ
కలదు కోరికగాని కానరాదు
నీవు కనరాకయుండియు నీదువారి
గూడ కనరాకచేయుట కూడునొక్కొ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కా -

చెయి జాచి మెల్లన చేరదీయగరాదె
గారాబుతనయను గానె నేను
అభయంబు నొసగి నన్నాదరింపగరాదె
కనగ ముద్దులపట్టి గానె నేను
చిరునవ్వుమోవి నాశీర్వదింపగరాదె
ప్రీతి చేకూర్చెడి కూతు గానె
చల్లనిచూపులవెల్లి చల్లగ రాదె
చిత్తంబునిండిన బత్తి లేదె
నన్ను కూతునుగాగ నానాథు డనఘు
డల్లుడుంగాగ నెంచి మమ్మరయలేవె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పతివి నీవని సేవ పాయక చేసెడి
తరుణికి మోక్షంబు తప్పదందు
తండ్రివి నీవని తగ తలపోసెడి
తరుణికి మోక్షంబు తప్పదందు
రన్నవు నీవని యాత్మ భావించెడి
సతులు వైకుంఠంబు జనుదురందు
రాత్మజాతుడ వీవ యని భావమున నెంచు
సతులు వైకుంఠంబు జనుదురందు
రలమహర్షులు వారివాక్యముల నంత
రంగమున నటు గనియు నుప్పొంగుదాన
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పరమాత్మ నీకు నాభరణ మీవలెనన్న
లోభపిశాచంబు లోంగదీయు
మునిలోల నీనామమును పఠించెదనన్న
సంసారబంధంబు సడలజేయు
దైత్యాంతకా నిన్ను తపముజేసెదనన్న
చపలతాభూతంబు చాటుపెట్టు
స్వర్ణాంబరా నిన్ను పరికింపవలెనన్న
ద్రవ్యపటం బడ్డుదగిలియుండు
మనసు పండదు నీమాయ మాసిపోదు
వెల్గువై నాయెడంద దీపింపరాదె
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

కాంతారములయందు ఘనమంద్రు వృక్షంబు
లందు పడతిజన్మ హైన్యమండ్రు
గ్రామంబులందున ఘనమంద్రు పశువులు
నందు పడతిజన్మ హైన్యమండ్రు
గగనంబునందున ఖగములు మేలందు
రందు నెలతజన్మ హైన్యమండ్రు
జలమున జలచరజాలంబు మేలందు
రందు పడతిజన్మ హైన్యమందు
రింతహీనత్వఖనియైన యింతిపుట్టు
వునె యిడితివేల నాకును బోధపడదు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణ ల వేణుగోపాలబాల.

కా వా వ ..

శతసహస్రంబులు శతకంబు లుండగ
ఈశతకంబు నా కేల యనెదో
వేదశాస్త్రార్థవిద్వద్వత్కవిత యుండ
ఈకవిత్వంబు నా కేల యనెదో
మత్తేభశార్దూలమంజువృత్తము లుండ
ఈ సీసమాలిక లేల యనెదో
హరిభక్తిపుంభావమైనవా రుండంగ
ఈభక్తురాలు నా కేల యనెదో
ఇట్టిభేదంబు లెరుగనియీశుడ వని
చిత్తశుద్ధినిజేసి వ్రాసితిని గొనుము
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

పదియేండ్లనుండి నీపై చిత్తమున్ నిల్పి
అర్చింతుగాని నన్నరయ వీవు
పలువేలయక్కరంబుల బెట్టి నిన్ గూర్చి
వ్రాసితిగాని కన్పడవు నీవు
గ్రంథమ్ములను నసంఖ్యాకమ్ములపఠించి
తినిగాని నీయున్కి తెలియపడదు
వివిధమంత్రమ్ములన్ వేడుకమై నేర్చి
జపియించితినిగాని కృపనుగనవు
కృపకునిధివట యామాట క్రిందుచేసి
మాయకున్ తావనన్ చెల్లుమాంత్రికేశ
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

మహనీయసుగుణసమంచితు నానాథు
నీభక్తు బ్రోవుమా నీరజాక్ష
కులముద్ధరించువారల పెక్కురన్ నిల్పి
మావంశముల నిల్పుమా రమేశ
ఆజన్మమున్ పూజ లాచరించుటకునై
సిరుల కల్పింపుమా శేషశయన
దేవతాపూజను గావించుపట్లను
చిత్తస్థితిన్ గూర్పు చిత్స్వరూప
ఇంతకన్నను కోరిక లేమి లేవు
వీని నిచ్చినచో పదివేలు నాకు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

ఘనుడు కాళ్యూరుజోగారాయదీక్షిత
వరుడు నన్గన్నట్టి పండితుండు
సోమరాజాన్వయశుభాంశువైనట్టి
రంగరాయుండు నాప్రాణవిభుడు
నిరతంబు వీక్షణనియతి కల్మలజిల్కు
ననబోడి శ్రీదేవి నా కుపాస్య
అలవశిష్ఠునిగూర్చి ఆయరుంధతివోలె
నాథు నర్చించుచే నాదుకృత్య
మిట్టిననుబ్రోవకుండుట యేమి త్రి
స్వజనసంతతవని పెద్దసనదు గలదు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

శ్రీరమారమణీవిశిష్టమానసలోల
మంగళం బిదె జయమంగళంబు
భక్తసంత్రాణదివ్యతాత్పర్యపారీణ
మంగళం బిదె జయమంగళంబు
గర్భసంస్థితనైకఘనలోకసంతాన
మంగళం బిదె జయమంగళంబు
సనకసనందనాద్యనఘతాపసవంద్య
మంగళం బిదె జయమంగళంబు
బ్రహ్మరుద్రేంద్రవందితపాదపద్మ
మంగళం బిదె కొను జయమంగళంబు
శ్రీయుతాకార వల్లవీచిత్తచోర
భవ్యగుణశీల వేణుగోపాలబాల.

* * *